# "ఆటలో ఆటగా నవ్వులో నవ్వుగా, సరిగ్గా చూసీ, ఆలోచించీ, టక్కున అంటించాలీ యింక, సరదాగా యిది చెయ్యాలింక" — ఫెవీ ఫెయిరీ





"ఇంద్రజాలం కాదే కొరివి
చేత్తోచేసే తమాషా యిది
రబ్బాతోనూ పనియే లేదు
దీనికి యిక మరి తిరుగేలేదు."
"ఏమిటిదంతా యిటోరిస్సి చెప్పు
ఏంచెయ్యాలో దబ్బున చెప్పు."
"రండర్రా యిటు రండర్రా
చెప్పేదేదో వినిపొండర్రా
ఆలోచించి అంటించింక
ఫెవికాల్ ఎమ్ ఆర్ తేవాలింక
ఏ బొమ్మయినా, ఏ బుట్టయినా
ఏ వర్ణమైనా చేసెయ్యొచ్చు
పట్టుకోకనే పట్టుకునేదిది
మరికే కాదిది మచ్చుకైనది
సరదా సరదా తమాషాయిక
బొమ్మైనా చేసెయ్యింక"

సన్‌ఫ్లవర్ పూలు ఎలా తయారుచెయ్యాలి అనే తీరుని ఉచితంగా పొందటం కోసం ఈ కూపన్ పంపించండి లేదా యీ చిరునామాకు వ్రాయండి : "ఫెవీ ఫెయిరీ" పోస్ట్ బాక్స్ 11084, బొంబాయి 400 020.

పోస్ట్ బాక్స్ 11084, బొంబాయి 400 020.
పేరు: ____________________
వయస్సు: ____________________
చిరునామా: ____________________
____________________
ఊరు: ____________________
రాష్ట్రం: __________ పిన్: __________

ఫెవికాల్ ఎమ్ ఆర్
సింథెటిక్ ఎడ్హెసివ్




**బాగా పనిచేసేది, మరెంతో పేరున్నది ఫెవికాల్ ఎమ్ఆర్ అంటేనే అది**

® ఒక [logo] మరియు ఫెవికాల్ ట్రాండ్ రెండూ పిడిలైట్ ఇండస్ట్రీస్ ప్రైవేట్ లిమిటెడ్, బొంబాయి 400 021 వారి రిజిష్టర్డ్ (ట్రేడ్‌మార్క్స్) గుర్తు.

OBM-8527 TL



# మిఠాయిల మహారాజు పాలతో వినోదం కల్పించాడు




# కారమిల్క్




శ్రేష్ఠమైన మీగడపాలు, మరియు బంగారపు రంగు కేరమిల్, ప్యారీస్ ఈ నోరూరించే, మెత్తని పాల మిఠాయిలలో, వాటిని కావలసిన రీతిలో చేర్పింది.

నోరూరించే రకరకాల ప్యారీస్ మిఠాయిలు:

కారమిల్క్ • ట్రి-మా • చాకొలెట్ ఎక్లెయిర్స్ • కోకోనట్ పంచ్ • చాక్లెయిర్స్ • కోకోనట్ క్రీము • లాక్టోపాప్స్ • గోల్డెన్ బాన్ బాన్




70 సంవత్సరాలకుపైగా మిఠాయిలలో మొట్టమొదటి పేరు



# చందమామ

డిసెంబర్ 1986



ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు






విడి ప్రతి: 2-50

సంవత్సర చందా: 30-00

సూపర్ పొంగి
పొరలే నురుగ
సూపర్
ప్రకాశవంతముగ
ఉతుకు!

# "సూపర్ కాంతులు వెదజల్ల నేను సూపర్ పవర్ రీగల్ నే విశ్వసిస్తాను"

"ఎందుకంటే సూపర్ పవర్ రీగల్ పొంగి పొరలే నురుగు; బట్టలను గట్టిగా అంటిపెట్టుకొని ఉన్న మురికినికూడా నిర్మూలించి ప్రకాశవంతముగా ఉతక గలదు."




తయారీదార్లు
షా వాలెస్




మాత్రమే!

సూపర్ పవర్ **రీగల్** డిటర్జెంట్ సబ్బు

ACIL/008/86-Tel

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'

సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ ["దోషమెవరిది ?"]కి ఆధారం, లక్ష్మీగాయత్రి రచన.

మూర్ఖుడికి మౌనమే భూషణం, అన్న సుభాషితం అందరెరిగినదే. కాని, మూర్ఖుడు అది అర్థం చేసుకోలేడు గనక, మౌనం వహిస్తాడన్న నమ్మకం లేదు. అందువల్ల, వివేకి అయినవాడు, తగుజాగ్రత్తలో వుండడం అవసరం. ఈ విషయం ''ఆలోచనాపరుడు'' అన్న కథలో తెలుసుకుంటాం.

## అమరవాణి

దుర్జనేన సమం సఖ్యం, ప్రీతిం చాపి న కారయేత్,
ఉష్ణో దహతి చాంగారః, శీతః కృష్ణాయతే కరమ్.

[దుర్జనులతో స్నేహం, సామీప్యతా అన్నివేళలా హానికలిగిస్తుంది. మండుతూన్న బొగ్గు చేతిని కాలుస్తుంది; చల్లగా ఉన్న బొగ్గును తాకినా చేతిని నల్లగా మసి చేస్తుంది.]

సంపుటి 79 డిసెంబర్ '86 సంచిక 6

విడి ప్రతి : 2-50 :: సంవత్సర చందా : 30-00






# చందమామ కబుర్లు




## నిద్రలేకుండా నలభైయేళ్ళు...

మనిషి జీవించడానికి ఆహారం లాగానే నిద్రకూడా చాలా అవసరం. నిద్రలేకుండా మనిషి కొన్ని రోజులు కూడా బతక లేడు. అయితే క్యూబాకు చెందిన టోమాస్ ఇజిక్వియార్డో నలభై సంవత్సరాలు, ఒక్క కునుకు తీయకుండా జీవించాడు. ప్రపంచవైద్య చరిత్రలో మరెక్కడా ఇటువంటి వింత జరిగి నట్టు దాఖలాలు లేవు—అంటున్నారు క్యూబాకు చెందిన ప్రముఖ మనస్తత్వవేత్త డా॥ పెద్రోగార్షియా!

## దీర్ఘాయుష్షు రహస్యం

బ్రిటన్‌కు చెందిన 108 సంవత్సరాల వృద్ధుడు, ఆయన ఇంత కాలం జీవించడానికి ముఖ్యంగా మూడు రహస్యాలను వెల్ల డించాడు: ఆయన మద్యం ముట్టడు; పొగపీల్చే అలవాటు లేదు; ఎప్పుడూ ఏదో ఒక పని చేయడం అంటే ఆయనకు చాలా ఇష్టం!





## తెలివిగల జంతుజాలం

చింపాంజీ, ఒరాంగ్ ఉటాంగ్, ఏనుగు, గొరిల్లా, కుక్క గుర్రం, సీ-లయన్, ఎలుగుబంటి, పిల్లి మొదలైన జంతువులకు, మంచి జ్ఞాపకశక్తితోపాటు గ్రహణశక్తి కూడా కలదని న్యూయార్క్ జూ మాజీ డైరెక్టర్ డా॥ వీడ్ బ్లెయిర్ అభిప్రాయపడుతున్నారు.

పురాణగాథలు :

# జయంతి

ఒకానొకప్పుడు రాక్షసుల గురువైన శుక్రాచార్యుడు, కైలాసపర్వతం మీద శివుణ్ణి గురించి తపస్సు ప్రారంభించాడు. శుక్రుడి తపస్సు ఫలించినట్టయితే, తమకు హాని వాటిల్లగలదని దేవతలు శంకించారు. ఎలాగైనా ఆయన తపస్సుకు భంగం కలిగించాలని ఒక పథకం వేశారు. దేవతలందరూ కలిసి, అపురూప సౌందర్యవతి అయిన ఇంద్రుడి కుమార్తె జయంతి దగ్గరికి పోయి, "దేవతల క్షేమం కోసం నీ సహాయం కోరివచ్చాము," అన్నారు.

"ఏమిటది?" అన్నది జయంతి ఆశ్చర్యంగా.

"తప్పక చేస్తానని మాట ఇస్తేనే చెబుతాము," అన్నారు దేవతలు.

"మీ క్షేమానికన్నా నాకు కావలసిన దేమున్నది? ఏమి చేయాలో సెలవివ్వండి క్షణంలో చేస్తాను," అన్నది జయంతి అమాయకంగా.

"కైలాసపర్వతం మీదికి వెళ్ళి, అక్కడ తపస్సు చేసుకుంటున్న శుక్రుడికి శుశ్రూషలు చేసి, ఆయన్ను నువు పెళ్ళాడాలి," అన్నారు దేవతలు.

తన ద్వారా శుక్రుడి తపస్సుకు భంగం కలిగించడమే దేవతల ఉద్దేశం అని, అప్పటికి గ్రహించింది జయంతి. అయినా మరొకరి పతనానికి తాను కారణం కావడం ఆమెకు ఇష్టం లేదు. అయినప్పటికీ దేవతలకు ఇచ్చిన మాట తప్పలేక, ఆమె మునికన్యలా కైలాసగిరికి వెళ్ళి, శుక్రుడికి శిష్యురాలిగా భక్తిశ్రద్ధలతో శుశ్రూషలు చేయసాగింది.

కొన్నాళ్ళకు శుక్రుడి తపస్సు ఫలించింది. శివుడివల్ల వరాలు పొందాడు. ఆ తరవాత శుక్రుడు జయంతి చేసిన పరిచర్యలకు సంతసించి, ఆమెను కావలసిన వరం కోరుకోమన్నాడు. జయంతి, తనను వివాహమాడవలసిందిగా శుక్రాచార్యుణ్ణి ప్రార్థించింది. శుక్రుడు సంతోషంగా ఆమెను పెళ్ళాడాడు.

జయంతి, శుక్రుడి తపస్సుకు భంగం కలిగించలేదు గాని, తను దేవతలకు ఇచ్చిన మాట ప్రకారం అసురగురువును వివాహమాడింది!





# చిన్నసన్యాసి-చిన్నబాబు

గోదావరీ తీరంలో, శివస్వామి అనే సన్యాసి, ఒక చిన్న కుటీరంలో నివసిస్తూండే వాడు. ఆయన రోజు కొకసారి, దాపుల నున్న గ్రామానికి భిక్షకు వెళ్ళేవాడు. ఆయనపట్ల భక్తిగల గృహస్థుల్లో, ఏ ఒకరో ఆయనకు భోజనం పెట్టేవాళ్ళు. శివ స్వామి దానితో తృప్తిపడి కుటీరానికి తిరిగి వస్తూండేవాడు.

ఆ గ్రామజమీందారుకు సన్యాసిపట్ల ఎంతో భక్తిగౌరవాలుండేవి. ఆయన ఒక నాడు సన్యాసి కుటీరానికి వచ్చి, "స్వామీ, మీరు రోజూ గ్రామంలోకి పోయి భిక్ష ఎత్తడం ఏమీ బాగాలేదు. నేను, తమకు రోజూ భోజనం పంపగలను. తమరు కుటీరం వదలవలసిన అవసరం వుండదు," అన్నాడు.

దానికి సన్యాసి నవ్వి, "నేను రోజుకు ఒక్కసారి మాత్రమే భుజిస్తాను. నా ఆకలి గ్రామస్థుల వల్ల తీరిపోతున్నది. చిన్న కట్టుపంచా, భుజం మీదికి ఒక చిన్న వస్త్రం లాటివి, ఏ సంవత్సరాని కొకసారో గాని కొత్తవి అవసరం కావు. వాటినీ గ్రామస్థులు ఇస్తున్నారు. దేవుడి దయవల్ల, మరే ఇతర అవసరాలూ లేకుండా, వీటితో నేను తృప్తి పడుతున్నాను," అన్నాడు.

జమీందారు, సన్యాసి ఎంతటి సర్వ సంగ పరిత్యాగో తెలుసుకుని, మరి మాట్లాడకుండా, ఆయన పాదాలకు మొక్కి కుటీరం నుంచి బయటికి వచ్చాడు.

సన్యాసి అన్న మాటలూ, జమీందారు ఆయన పాదాలకు మొక్కడం, ఆ దారి పోతున్న చిన్నడు అనే అనాథ బాలుడు చూశాడు. వాడికి సన్యాసిపట్ల భక్తి భావం కలిగింది. దానితో వాడు, కుటీరంలోకి వెళ్ళి, సన్యాసికి సాష్టాంగ పడ్డాడు.

దేవప్రియ



అందుకు సన్యాసి తల పంకించి, "చిన్నా, ఎన్నో సంవత్సరాలుగా నువ్వు నాకు ఎంతో భక్తితో సేవ చేశావు. నేను సంతృప్తుణ్ణయాను. ఇప్పుడు నాలాగా సన్యాసివై, నాతోపాటు తీర్థయాత్రలు చేయాలన్న, నీ కోర్కె కూడా మెచ్చదగిందే. కాని, అందుకు ఇంకా సమయం రాలేదు. మరి కొంతకాలం ఓపిక పట్టు. ఇక్కడ జమీందారుతో, నీ గురించి చెబుతాను. ఆయన నీకు సేద్యానికి కొంత భూమి యిస్తాడు. సుఖంగా బతుకు," అన్నాడు.

ఆ సమయంలో చిన్నడికి పదహారేళ్ళ వయసు. గురువు ఇచ్చిన సలహాకు వాడు బాధపడుతూ, "గురుస్వామీ, నాకీ ప్రపంచ సుఖాల మీద ఆశలేదు. మీలాగే, ఈ కుటీరంలో వుంటూ, రోజు కొక్క భోజనంతో కాలంగడుపుతాను," అన్నాడు.

సన్యాసి ఏమీ అనకుండా నవ్వి వూరుకుని, ఆ మర్నాడే తీర్థయాత్రలకు వెళ్ళిపోయాడు.

శివసన్యాసి కుటీరం వదిలాక, అందులో నివసిస్తున్న ఆయన శిష్యుడు చిన్నడిని, అందరూ చిన్నసన్యాసి అని పిలవసాగారు. ఇప్పుడతడికి చిన్న అంగవస్త్రం, పై పంచా, నీళ్ళకూజా తప్ప, మరే ఆస్తిపాస్తులూ లేవు.

సన్యాసి వాణ్ణి దీవించి, వివరాలడిగాడు. చిన్నడు తాను తల్లీ దండ్రీ లేని అనాథుణ్ణని సన్యాసికి చెప్పి, "స్వామీ, నేనిక్కడే వుండి, తమకు సేవ చేసుకుంటాను," అన్నాడు.

సన్యాసి అందుకు ఒప్పుకున్నాడు. కాలం గడుస్తున్న కొద్దీ, చిన్నడికి సన్యాసి పట్ల మరింత భక్తిగౌరవాలు వృద్ధి కాసాగాయి.

ఒకనాడు సన్యాసి, తను తీర్థయాత్రలకు పోదలచినట్టు చిన్నడికి చెప్పాడు. చిన్నడు ఆయన పాదాలు తాకి, "గురుస్వామీ, నన్నూ తమ వెంట రానివ్వండి," అన్నాడు.

ఒకనాటి రాత్రి చిన్నసన్యాసి పైబట్టను ఎలుకలు కొరికినై. తెల్లవారి అది చూసి అతడు, కుటీరం పక్కన వున్న కాలి బాట వెంట పోతున్న, ఒక గ్రామస్థుడికి, విచారంగా ఆ సంగతి చెప్పాడు.

గ్రామస్థుడు, సన్యాసితో, "మీరు కోర తుండానే, మరొక వస్త్రాన్ని నేనివ్వగలను. కాని, అందువల్ల, మీ చిక్కు తీరదు. ఎలుకలు దాన్నీ, ఏదో ఒకనాటి రాత్రి కొరికి వేయగలవు. అందువల్ల, మీరొక పిల్లిని పెంచడం క్షేమం," అన్నాడు.



పిల్లిని పెంచడం అన్నమాట వింటూనే చిన్నసన్యాసి ఉలిక్కిపడి, "గోచిపాత రక్షణ కోసం పిల్లిని పెంచడంతో ప్రారంభించి, సంసార సాగరంలో మునిగిన, ఒక సన్యాసి కథ ఎవరో చెప్పగా విన్నాను. నాకూ, ఆ దుర్గతే పడుతుంది," అన్నాడు.

గ్రామస్థుడు, ఆ మాటలకు నవ్వి, "చిన్నస్వామీ! అది కల్పనా కథ. ఒక వేళ నిజం అనుకున్నప్పటికీ—ఆ సన్యాసికి మీలాంటి మనోనిగ్రహం వుండి వుండదు. మీరు మహానిగ్రహవంతులేకాక, సర్వాన్నీ త్యజించిన శివసన్యాసి శిష్యులు!" అన్నాడు.

చిన్నసన్యాసి మౌనంగా వూరుకున్నాడు. మర్నాడు గ్రామస్థుడు ఒక పిల్లి కూనను తెచ్చి, సన్యాసికి యిచ్చి పోయాడు.

అయితే, ఆ పిల్లికూన ఇంకా స్వయంగా ఆహారం సంపాయించుకోవడం చేతకాని దవడంతో, ఆకలికొద్దీ రోజంతా అరవ సాగింది. ఈ సంగతి చిన్నసన్యాసి ద్వారా విన్న మరొక గ్రామస్థుడు, "అయ్యో, పిల్లి కూనలాంటి దానిని, ఆకలితో మాడ్చడం ఎంత పాపం! మీరు వెంటనే వెళ్ళి జమీందారుగారి నడగండి. ఆయన తప్పక ఒక పాడి ఆవు నిస్తాడు. దాని పాలతో పిల్లికూన ఆకలి తీరిపోతుంది," అని చెప్పాడు.

చిన్నసన్యాసికి, ఈ సలహా నచ్చింది. అతడు అప్పటికప్పుడే జమీందారు దగ్గిరికి వెళ్ళాడు. శివసన్యాసి శిష్యుడైన చిన్న



సన్యాసి అంటే, జమీందారుకు గౌరవం వున్నది. ఆయన అతడికి ఒక పాడి ఆవు నిచ్చాడు.

ఇది జరిగిన వారం రోజులకు, గ్రామం లోని రాజయ్య అనేవాడు, చిన్నసన్యాసి దగ్గిరకు వచ్చి, "పిల్లికూన బతికేందుకు ఆవు పాలు కావాలి: బాగానే వున్నది. మరి, ఆవు బతికేందుకు పచ్చికా, ఇతర గడ్డిగాదంలు కావాలి గదా? ఈ కుటీరం చుట్టూ వున్న బీడు భూమంతా జమీందారుగారిది. ఆయన అనుమతి తీసుకున్నావంటే, ఇదంతా సేద్యం చేసి పెడతాను. వచ్చే ఫలసాయం నీది సగం, నాది సగం. అప్పుడు, నీ భోజనానికీ, ఇతర అవసరాలకూ పై వాళ్ళను దేవిరించవలసిన అవసరం వుండదు. పైగా, ఆవుకు కావలసినంత పచ్చిగడ్డి దొరుకుతుంది," అన్నాడు.

చిన్నసన్యాసికి, ఈ సలహా అద్భుతం అనిపించింది. జమీందారు, అతడి కోరిక విని, "నదికీ, నీ కుటీరానికీ మధ్యగల భూమి అంతా నీదే అనుకో! ఆ బీడు భూమితో నాకేంఅవసరంలేదు," అన్నాడు.

చిన్నసన్యాసి పరమానందం చెందాడు. రైతురాజయ్య తొలకరి వానలతోనే భూమి దున్నడం ప్రారంభించాడు. తరవాత దానికి నీరుపెట్టి, వరిసాగు చేశాడు. మంచిపంట పండింది. ఆ ధాన్యాన్ని దాచేందుకు, కుటీరం పడగొట్టి, ఆ స్థానంలో మండువాలోగిలి నిర్మాణం జరిగింది.

చిన్నసన్యాసికి, ఈ జరుగుతున్నదంతా ఎక్కడలేని సంతోషాన్ని కలిగిస్తున్నది. రైతు భార్యా, పెళ్ళీడు కూతురూ ఇంటి వెనక కూరపాదులు పెట్టారు. వాళ్ళే చిన్నసన్యాసికి వంట చేసి పెట్టసాగారు.

ఆ మరుసటి సంవత్సరం పంట మరింత బాగా పండింది. ఇంటి అవసరాలకు కొంత ధాన్యం నిలవచేసి, మిగిలిన దాన్ని, చిన్నసన్యాసి మంచి ధరకు అమ్మాడు.

ఒకనాడు రాజయ్య, చిన్నసన్యాసితో, "రోజులు ఎల్లకాలం ఒకేలాగుండవు.

మనిషికి నా అన్నవాళ్ళు, అవసరం. నా కూతుర్ని చూస్తున్నావు గదా—నీ కంత కంటె అనుకూలవతి దొరకదు. దాన్ని పెళ్ళి చేసుకో,'' అన్నాడు.

చిన్నసన్యాసికి, రాజయ్య కూతురు వినయగుణం, పనిపాటుల్లో నేర్పరితనం బాగా నచ్చాయి. అతడామెను పెళ్లి చేసుకున్నాడు. ఆనాటి నుంచి అందరూ అతణ్ణి, చిన్నసన్యాసి అని పిలవడం మాని, చిన్నబాబు అనసాగారు.

కొన్ని సంవత్సరాలు గడిచిపోయినై. చిన్నబాబు ఇద్దరు కొడుకులను కన్నాడు. వాళ్ళు పెరిగి పెద్దవాళ్ళయి, వ్యవసాయ పనుల్లో తండ్రికీ, తాతకూ సాయం చేయసాగారు.

పరిస్థితులిలా వుండగా—వృద్ధుడైన జమీందారు మరణించడం జరిగింది. ఆయన కొడుకు, చిన్నబాబును, అతడి ఆధీనంలో వున్న భూములను తిరిగి ఇచ్చివేయమన్నాడు. వాటిని చనిపోయిన జమీందారు, తనకు దానంగా యిచ్చాడని, చిన్నబాబు వాదించాడు. దానితో గ్రామంలోని వాళ్ళు కొందరు చిన్నబాబు పక్షం, కొందరు జమీందారు కొడుకు పక్షం అయ్యారు.

ఈ విధంగా కక్షలు పెరిగి, ఒకనాడు జమీందారు పక్షం వాళ్ళు, చిన్నబాబు ఇంటి పైకి దాడి వచ్చారు. చిన్నబాబు పక్షం వాళ్ళు, వాళ్ళను ఎదుర్కొన్నారు. ఇరుపక్షాలవాళ్ళూ, కర్రలతో, కత్తులతో



తలపడే సమయంలో, అదృష్టవశాత్తూ, తీర్థయాత్రలకు పోయిన శివసన్యాసి, అక్కడికి రావడం జరిగింది. ఆయన్ని చూస్తూనే, ఇరుపక్షాల వాళ్ళూ పోరుమాని, ఆయనకు తల వంచి నమస్కరిస్తూ నిల బడ్డారు.

శివసన్యాసి వాళ్ళను, "ఇరవైఅయి దేళ్ళ క్రితం ఇక్కడ ఒక చిన్న కుటీరం వుండేది. అందులో, నా శిష్యుడు వుంటూండేవాడు. ఆ కుటీరం ఏమైంది?" అని అడిగాడు.

ఆ ప్రశ్న వింటూనే చిన్నబాబు, శివ స్వామి కాళ్ళమీద పడి దుఃఖించసాగాడు. శివస్వామి అతణ్ణి లేవమని, ఆప్యాయంగా భుజం తట్టాడు. ఇతర గ్రామస్థులూ, జమీందారు కొడుకూ ఆయన పాదాలకు నమస్కరించారు.

అక్కడి కక్కడే శివస్వామి, ఇరు పక్షాల వాళ్ళకూ తృప్తికరంగా, భూమి సమస్యకు పరిష్కార మార్గం చెప్పాడు. ఆ రాత్రి చిన్నబాబు, శివస్వామితో, "గురుస్వామీ, తమరు తీర్థయాత్రలకు బయలుదేరినప్పుడు, నన్ను కూడా తమ వెంట రానివ్వమన్నాను. కాని, మీరు— ఇంకా సమయం రాలేదు; కొంతకాలం ఓపిక పట్టమన్నారు. అది ఎంతటి సత్య వాక్కు!" అన్నాడు.

శివస్వామి చిరునవ్వు నవ్వి వూరు కున్నాడు.

అప్పుడు చిన్నబాబు, ఆయన పాదాలు తాకి, "స్వామీ, ఇప్పుడు నేను సన్యాసం స్వీకరించి తమ అడుగుజాడలలో నడవ గలను." అన్నాడు.

శివస్వామి, అతణ్ణి దీవించి, "సంసారం అనే సుడిగుండం నుంచి బయటపడ డానికి, ఇది నీకు మంచి అదను. పెద్ద వాళ్ళయిన, నీ కొడుకు లిద్దరూ, వ్యవ సాయం చేసుకుంటూ, తల్లి సంరక్షణ చూడగలరు," అన్నాడు.

రెండు రోజుల తర్వాత, చిన్నబాబు కేవలం కట్టుబట్టలతో, గ్రామం వదిలి, శివస్వామి వెంట బయలుదేరాడు.





# ఆలోచనాపరుడు

సిరిపురం జమీందారు రామారాయుడికి, తండ్రి ఎంత ప్రయత్నించినా, చదువు అబ్బింది కాదు. ఆయన మనసులో శిస్తు వసూళ్ళూ, వేటా, రుచిగల భోజనం— వీటికి మించి ఎలాంటి ఆలోచనలూ మెదిలేవి కావు. ఎప్పుడూ ఏదో ఆలోచిస్తూ, పరాకుగా వుండేవాళ్ళు, కుశాగ్రబుద్ధులై వుంటారన్న నమ్మకం, ఆయనకుండేది. ఆ కారణం వల్ల, తన దివాణంలో వుండే వెంకన్న అనేవాడంటే, అయనకు ప్రత్యేకాభిమానం.

ఈ వెంకన్న ఎప్పుడూ ఏదో ఆలోచిస్తూండేవాడు. జమీందారు వాణ్ణి అన్నివేళలా తన పక్కనే వుంచుకుని, మధ్య మధ్య, "ఏం, వెంకన్నా, ఏమిటాలోచిస్తున్నావు?" అని ప్రశ్నించి వెంకన్న ఆలోచించే విషయం గురించి తెలుసుకుని ఆనందిస్తూండేవాడు.

ఒకనాటి రాత్రి నిద్రలో వున్న జమీందారుకు, ఏదో చప్పుడు కావడంతో మెలకువ వచ్చింది. ఆయన గది నుంచి బయటికివచ్చి, వరండాలో పక్క మీద పడుకోకుండా కూర్చుని ఆలోచిస్తున్న వెంకన్నను చూసి, "ఏమాలోచిస్తున్నావురా, వెంకన్నా?" అని అడిగాడు.

"అయ్యా, అమావాస్య రాత్రులప్పుడే, దొంగలు దొంగతనాలకు ఎందుకు బయలుదేరుతారా, అని ఆలోచిస్తున్నాను," అని సమాధానమిచ్చాడు వెంకన్న.

జమీందారు, ఆ సమాధానం విని తృప్తిపడి, లోపలికి వెళ్ళి పడుకున్నాడు. అయినా, ఆయనకు నిద్ర పట్టలేదు. వెంకన్న ఇప్పుడేం ఆలోచిస్తూంటాడో తెలుసుకోవాలన్న కోరిక కలిగింది.

, అయన గదిలోంచి బయటికి వచ్చి, "ఏం, వెంకన్నా, పడుకున్నావా?" అన్నాడు.

కలిదిండి జయ

''లేదండి! ఆలోచిస్తున్నాను," అన్నాడు వెంకన్న.

''ఏమిటాలోచిస్తున్నావు?'' అని అడిగాడు జమీందారు.

''దొంగలు దోచుకోవడానికి, డబ్బున్న వాళ్ళ ఇళ్ళకే ఎందుకొస్తారు? అని ఆలోచిస్తున్నాను,'' అన్నాడు వెంకన్న.

జమీందారు, ఆ సమాధానం విని, ''ఆహాఁ, వెంకన్న ఎంత గొప్ప ఆలోచనాపరుడు!'' అనుకుంటూ తిరిగి తన గదిలోకి వెళ్ళి పడుకున్నాడు.

ఆయనకు తెల్లవారుజామున మెలకువ వచ్చింది. గదిలో నుంచి బయటకు వచ్చి ఇంకా పక్క మీద కూర్చుని ఆలోచిస్తున్న వెంకన్నను చూసి, ''వెంకన్నా, ఇప్పుడేం ఆలోచిస్తున్నావు?'' అన్నాడు.

''అయ్యా, ఇంతకుముందే తమ ఇనప భోషాణంలోని ధనాన్ని దొంగిలించుకు పోయిన దొంగలు, ఆ ధనంతో ఏం చేస్తారు? అని ఆలోచిస్తున్నాను,'' అని జవాబిచ్చాడు వెంకన్న.

ఈ మాటలు వినగానే, జమీందారు గుండె ఝల్లుమన్నది. ఆయన భోషాణం వున్న గదిలోకి వెళ్ళాడు. అది ఖాళీగా వున్నది.

ఆయన పట్టరాని కోపంతో వెంకన్న దగ్గిరకు వచ్చి, ''ఏరా, బుద్ధి మాలిన వెధవా! దొంగలు దోచుకుపోతూంటే, నోరుమూసుకు చూస్తూ కూర్చున్నావా! అరిచి కేకలు వేస్తే, మేం లేచి దొంగలను పట్టుకునేవాళ్ళం కదా,'' అన్నాడు.

వెంకన్న జవాబివ్వలేదు. జమీందారు, వాడి కేసి కొరకొర చూస్తూ, ''ఏరా, మాట్లాడవు?'' అని గద్దించాడు.

వెంకన్న విచారంగా, ''అయ్యా, ఏం మాట్లాడను? దొంగలు దోచుకుపోయే సమయంలో, నాకెందుకు, ఈ ఆలోచన రాలేదని ఆలోచిస్తున్నాను,'' అన్నాడు.

జమీందారు, వాణ్ణి అప్పటికప్పుడే దివాణం నుంచి పంపేసి, ఆనాటి నుంచీ పనికిమాలిన ఆలోచనాపరులకు కాకుండా, పనిమంతులకు, తన దివాణంలో ఉద్యోగాలివ్వసాగాడు.






## 8

[అమరపాలుడి నాయకత్వాన వెళ్ళిన సైనికులు భయంకర పక్షుల్ని నిలువునా దహించారు. తరవాత రాకుమార్తె కాంతిమతిని, పులిరాయుళ్ళు మేనా ఎక్కించి ఎక్కడికో తీసుకు పోతున్నట్టు వార్త వచ్చింది. చిత్రసేనుడూ, ఉగ్రాక్షుడూ సైనికులతో వెళ్లి, మేనాను అడ్డగించారు. పులిరాయుళ్ళ నాయకుడు, రాజకుమార్తెను చంపమని ఆజ్ఞయిచ్చాడు. తరవాత—]

పులిరాయుళ్ళ నాయకుడు, తన అనుచరులకు చేసిన హెచ్చరిక వింటూనే, ఒకవైపు నుంచి చిత్రసేనుడూ, రెండవ వైపు నుంచి ఉగ్రాక్షుడూ అతడి సేవకులూ వాళ్ళ మీద పడ్డారు. చూస్తూండగానే పులిరాయుళ్ళు రాక్షసుల రాతి గదలకూ, చిత్రసేనుడి అనుచరుల కత్తిదెబ్బలకూ నేల కొరగసాగారు. ఇక విజయావకాశం ఏమాత్రం లేదని గ్రహించిన పులిరాయుళ్ల నాయకుడు, ఎక్కడ లేని తెగింపుతో ఒక చేత్తో కత్తినీ, రెండవ చేత్తో ఈటెనూ పట్టుకుని భయంకరంగా పోరాడుతూ, "మన అంతం సమీపించింది. ముందు కాంతిమతిని చంపండి!" అంటూ కేకలు పెట్టాడు.

ఆ కేకలు వింటూనే చిత్రసేనుడు నివ్వెరపోయాడు. రాజకుమార్తె ఈ దుర్మార్గుల చేతిలో తప్పక మరణించ




వున్న శత్రుసైనికుడి కత్తి ఒకటి తీసు కుని, మేనా పక్కకు వస్తున్న పులి రాయుళ్ళను ఎదుర్కొన్నది. ఇది చూసిన ఉగ్రాక్షుడు అడవి దద్దరిల్లేలా రంకె వేసి, "ఇదుగో, వస్తున్నాను, కాంతిమతీ! క్షత్రియకన్య వనిపించుకున్నావు!" అంటూ గదతో తనకు అడ్డువచ్చిన పులి రాయుళ్ళను బంతులను కొట్టినట్టు గాలి లోకి ఎగరకొడుతూ మేనాను సమీపిం చాడు. ఈ లోపల చిత్రసేనుడు కూడా మేనాను సమీపించాడు. వాళ్ళకు రక్తం ఓడుతున్న కత్తి పట్టుకు నిలబడివున్న కాంతిమతి కంట బడింది.

గలదని అతడు భావించాడు. తనకూ, రాజకుమార్తె వున్న మేనాకూ మధ్య దాదాపు పదిమంది శత్రువులు అన్నిటికీ తెగించి అతి భీకరంగా పోరాడుతున్నారు. వీళ్ళను చంపి గాని తను మేనాను సమీ పించలేడు.

చిత్రసేనుడు మహోద్రేకంతో కత్తిని ఎదురుగా వున్న శత్రువుల మీదికి విసురుతూ, తనను పక్కల నుంచి ఎదుర్కొంటున్న శత్రువుల మాటే మరిచి, సూటిగా మేనాకేసి వెళ్లసాగాడు. అంతలో మేనా తలుపులు ఫెళ్ళుమంటూ తెరుచు కున్నవి. కాంతిమతి మెరుపులా మేనా నుంచి కిందికి దూకి, దాపుల చచ్చి పడి

"ఈయన చిత్రసేనమహారాజు. నేను ఉగ్రాక్షుణ్ణి! ఈ అడవి అంతా నాదే!" అన్నాడు ఉగ్రాక్షుడు, కాంతిమతితో.

కాంతిమతి ఉగ్రాక్షుడి కేసి కోపంగా చూసి, చిత్రసేనుడి వైపుకు తలయినా తిప్పకుండా గిర్రున వెనుదిరిగి, మేనాలో ఎక్కి కూర్చున్నది.

రాజకుమారి కాంతిమతి ప్రవర్తన చిత్రసేనుడికి ఆగ్రహం కలిగించింది. తను ప్రాణాలకు తెగించి పులిరాయుళ్లతో పోరాడి, ఆమెను కాపాడాడు. అయినా, రాజకుమారి తనకు కృతజ్ఞత చెప్పక పోగా, ఈసడించినట్టు తన కేసి చూడటం అతడికి పెద్ద అవమానంగా తోచింది.

"ఉగ్రాక్షా, ఇక్కడ మన పని ముగిసింది. ఇక మనం సైన్యాలతో ధవళగిరికేసి బయలుదేరటం మంచిది," అన్నాడు చిత్రసేనుడు.




చిత్రసేనుడి మాటలు వింటూనే ఉగ్రాక్షుడు అదిరిపడ్డాడు. తాము ముందు అనుకున్న పథకం ప్రకారం, అంతా కలిసి కపిలపురం కోటను ముట్టడించవలసి వున్నది. ఆ పని మీద అంతకు ముందే కొద్ది సైన్యంతో అమరపాలుడు వెళ్ళాడు. కపిలపురం కోటను వశపరుచుకుని, ఆ తరవాత రాజద్రోహి నాగవర్మను హతమార్చాలని లోగడ నిర్ణయం జరిగింది. కాని, ఇప్పుడు చిత్రసేనుడి ధోరణి చూస్తూంటే మరోలా వున్నది.

"చిత్రసేనా, మనం ముందుగా కపిలపురం కోటను వశపరుచుకోదలిచాం గదా? అదృష్టవశాత్తూ, మార్గమధ్యంలో రాకుమారిని కాపాడాం," అన్నాడు ఉగ్రాక్షుడు తడబడుతూ.

"మనం రాకుమారిని కాపాడామా? ఊహుఁ, ఆవిడే మనను రక్షించినట్టుగా ప్రవర్తిస్తున్నది. జ్వాలాద్వీపవాసులతో చేతులు కలిపిన నాగవర్మ, వీరసింహ మహారాజును బందీని చేసి జ్వాలాద్వీపం పంపినట్టు అమరపాలుడు లోగడే చెప్పాడు. అటువంటి పరిస్థితుల్లో, మనం యుద్ధం చేసి కపిలపురాన్ని వశపరుచుకుని ఎవరికి రాజరికం కట్టబెట్టగలం?" అన్నాడు చిత్రసేనుడు కోపంగా.

చిత్రసేనుడు మాటలు ముగించేలోపలే, కాంతిమతి మేనాలో నుంచి బయటికి వచ్చింది. ఆమె చిత్రసేనుడికేసి అనుమానంగా చూస్తూ, "నా తండ్రిగారిని ద్రోహి నాగవర్మ జ్వాలాద్వీపం పంపినట్టు మీతో చెప్పిన ఆ అమరపాలుడు ఎవరు?" అని ప్రశ్నించింది.

"అతడు కపిలపురంవాడే. నాగవర్మ సైన్యంలో చేరి, మాకు బందీగా చిక్కి, తరవాత కొన్ని రహస్యాలు చెప్పి, మాకు సహాయపడ్డాడు," అన్నాడు చిత్రసేనుడు.



''ఇంతకుముందు మీ ప్రవర్తన మరో విధంగా వున్నది. నన్ను మీ సామంతరాజు కన్న కూడా హీనంగా చూశారు. బహుశా నన్ను గురించి మీకేమీ తెలియదేమో. ఇప్పుడు మీరున్న ఈ అడవిప్రాంతం అంతా నాది. ఇక్కడికి దాపులనే వున్న అపూర్వ భవనం, దానికి ఆనుకునివున్న నగరం—నా రాజధాని,'' అన్నాడు చిత్రసేనుడు గాంభీర్యం వుట్టిపడే గొంతుతో.

రాజకుమారి కాంతిమతి పెదాల మీద చిరునవ్వు కదలాడింది. ''ఈ అడవి అంతా తనదని, ఇంతకుముందు ఉగ్రాక్షుడు నాతో అన్నాడు,'' అన్నదామె.

చిత్రసేనుడు, ఉగ్రాక్షుడి కేసి నిప్పులు చెరిగే కళ్ళతో చూశాడు. ఉగ్రాక్షుడు ఒక్క నిమిషం గజిబిజి పడిపోయాడు. అతడి నోటివెంట మాట పెగలలేదు. ''ఈ అడవి నాదయినా, నేను చిత్రసేన మహారాజుగారి మనిషిని. అందువల్ల అడవి కూడా ఆయనదే,'' అన్నాడతడు బిక్క మొహం వేసి.

''ఇప్పుడు నాకు సంశయ నివారణ అయింది. కపిలపురం రాజైన వీరసింహుడి ఏకైక పుత్రిక అయిన నేను—కాంతిమతిని, చిత్రనగర మహారాజయిన చిత్రసేనులవారి సహాయం కోరుతున్నాను. రాజద్రోహి అయిన నాగవర్మవల్ల కారా

''ఆ అమరపాలుడు చెప్పింది అబద్ధం. బహుశా, అతడికి నిజం తెలిసివుండదు. నా తండ్రిగారు కోటలోనే ఏదో భూగృహంలో బంధించబడి వున్నారు,'' అన్నది కాంతిమతి.

''అలాగా!'' అన్నాడు చిత్రసేనుడు.

''మనం ఆయన్ని రక్షిద్దాం, చిత్రసేనా!'' అన్నాడు ఉగ్రాక్షుడు ఆత్రంగా.

''పిలవని పేరంటం మన కెందుకు? మన నుంచి అలాటి సహాయం కావాలని ఎవరు కోరారు?'' అంటూ చిత్రసేనుడు ఉగ్రాక్షుడి మీద కన్నుమన్నాడు.

''సహాయం చేయవలసిందని నేను కోరుతున్నాను,'' అన్నది కాంతిమతి.



గారంలో బంధించబడిన నా తండ్రిని రక్షించి, ఆ ద్రోహిని తగు విధంగా శిక్షించ వలసిందని నా ప్రార్థన,'' అన్నది కాంతి మతి ఎంతో గౌరవం పుట్టిపడే కంఠ స్వరంతో.

కాంతిమతి అలా అనేసరికి చిత్రసేనుడి హృదయం ఆనందంతో ఉప్పొంగి పోయింది. అతడు ఉగ్రాక్షుడి కేసి తిరిగి, ''ఉగ్రాక్షా! నీ పొగరుబోతు మాటలు ఎన్ని అపోహలకు కారణం అవుతున్నవో, ఇప్పటికైనా గ్రహించావా? ఇకనైనా 'ఈ అడవి నాది.' అనే బొల్లిమాటలు కట్టిపెట్టు. అంతేకాక, ఇంతకుముందు నువ్వన్నట్టు, నీవు మహారాజుగారి మనిషివి కాదు, రాక్షసుడివి—నా సేవకుడివి!'' అన్నాడు కఠినంగా.

''ఓ౯, సేవకుణ్ణే, సేవకుణ్ణే, ముమ్మాటికీ!'' అంటూ ఉగ్రాక్షుడు కాంతిమతి కేసి తిరిగి ప్రణామం చేశాడు.

కాంతిమతి చిరునవ్వు నవ్వింది. చిత్రసేనుడు ఇనుమడించిన ఉత్సాహంతో తన అనుచరులకేసి తిరిగి, ''మేనా వెంట వున్న పులిరాయుళ్ళలో ఎవరూ ప్రాణాలతో పారిపోలేదనుకుంటాను. సరే, ఇక మనం సరాసరి కపిలపురానికి బయలుదేరి వెళ్ళాలి. మీలో నలుగురు మేనా ఎత్తు కోండి,'' అని చెప్పి కాంతిమతితో, ''రాకుమారీ, మీరు మేనా ఎక్కండి,'' అన్నాడు.

కాంతిమతి తల అడ్డంగా తిప్పుతూ, ''మహారాజా! ఇప్పుడు నేను బందీని కాను. కనుక, మీతోపాటు స్వేచ్ఛగా గుర్రం మీద ఎక్క రానివ్వండి.'' అన్నది.

''అవును, మహారాజా! అదే ఖావుంటుంది. రాజకుమారి ఇందాక పులిరాయుళ్ళను కత్తితో ఎదుర్కొన్న తీరు చూశారు గదా!'' అన్నాడు ఉగ్రాక్షుడు.

''ఆమె ఇక కత్తిపట్టి యుద్ధం చెయ్యవలసిన అవసరం లేదు. గుర్రం ఎక్కి మన వెంట రావొచ్చు. కపిలపురం కోటను వశపరుచుకోవటం, వీరసింహ మహా



రాజును బంధవిముక్తుణ్ణి చేయటం— అదంతా మన పని. ఆ ప్రయత్నంలో శత్రువులతో చేయవలసిన పోరు మన సైనికులూ, మనం చేస్తాం,'' అన్నాడు చిత్రసేనుడు.

ఆ వెంటనే చిత్రసేనుడి సైనికులూ, ఉగ్రాక్షుడి అనుచరులైన రాక్షసులూ జట్లు జట్లుగా చేరి, అశ్వారూఢులైన చిత్రసేన, కాంతిమతుల వెనకగా, కపిలపురం కేసి బయలుదేరారు. ఒక గంట తరవాత వాళ్ళు కొండదాపుల వున్న కపిలపురం కోటను సమీపించారు. దూరాన వుండగానే వాళ్ళకు కోట బురుజుల మీద వున్న శత్రుసైనికులూ, కోట మీద ఆకాశంలో పహరా తిరుగుతున్న రెండు భయంకర పక్షులూ కనిపించినై.

ఆ భయంకర పక్షుల్ని చూస్తూనే చిత్రసేనుడితో పాటు, ఉగ్రాక్షుడు కూడా నివ్వెరపోయాడు. ఉగ్రాక్షుడు ఆత్రంగా చిత్రసేనుడి దగ్గిరకు పరిగెత్తుకువచ్చి, ''మహారాజా! ఇక్కడ కూడా మన పాలిటికి ఈ భయంకర పక్షులు దాపరించినై. సైన్యంతో మీరు పంపిన అమరపాలుడి అయిపూ అజా లేదు. అందర్నీ శత్రువులు స్వాహా చేయలేదు గదా?'' అన్నాడు.

చిత్రసేనుడి కూడా ఇలాంటి అనుమానమే కలిగింది. అతడు కోట ద్వారాల కేసి చూశాడు. అవి బంధించబడి వున్నవి. వాటిముందు ఎక్కడా మరణించిన సైనికులు పడివున్న సూచనలు లేవు. బహుశా, అమరపాలుడు కోటను వశపరుచుకోవటం తన తలకు మించిన పని అని గుర్తించి, ఈ ప్రాంతాల ఎక్కడో కాపలా వేసి వుంటాడు.

చిత్రసేనుడు ఇలా ఆలోచిస్తున్నంతలో, అల్లంత దూరంలో చెట్ల మధ్య కోలాహలం బయలుదేరింది. చూస్తూండగానే అమరపాలుడు గుర్రాన్ని దూకిస్తూ, చిత్రసేనుడి దగ్గిరకు వచ్చి, ''చూశారా మహారాజా! నాగవర్మ ముఖ్య సైన్యంతో

కోట వదిలి ధవళగిరి మీదికి దాడి వెళ్తూ, కోటకు తగిన రక్షణ ఏర్పాటు చేశాడు. ఇందాకటి నుంచి చూస్తున్నాను. ఆ భయంకర పక్షులు రెండే రెండు కోట మీద గస్తీ తిరుగుతున్నవి. అంతకు మించి కోటలో మరి పక్షులు వున్నట్టు లేదు. బురుజుల మీద కాపలా వున్న వాళ్ళు కూడా ఎక్కువమంది కాదు. అయినా, నా వెంట వున్న కొద్దిపాటి సైన్యంతో కోట మీదికి వెళ్ళటం ప్రమాద మని మీ రాకకోసం ఎదురు చూస్తూ, ఇక్కడే కాపు వేశాను," అన్నాడు.

"మంచిపని చేశావు. దుస్సాహసం చేసి వున్నట్టయితే స్వల్ప సంఖ్యలో వున్న మీరందరూ సర్వనాశనం అయిపోయే వాళ్ళు. వేచివుండటమే మంచిదయింది," అంటూ చిత్రసేనుడు ఉగ్రాక్షుడి కేసి తిరిగి, "ఉగ్రాక్షా, మనం కోట ద్వారాలను బద్దలుకొట్టి లోపల జొరబడట మొక్కటే మార్గం. అందుకు తగినవాళ్ళు నీ అనుచరులు!" అన్నాడు.

ఉగ్రాక్షుడు ఓసారి చిత్రసేనుడి కేసీ, కోట మీద ఎగురుతున్న భయంకర పక్షుల కేసీ చూసి, తల గోక్కుంటూ, "నా అనుచరుల్లో కొందరిని కోట తలుపులు బద్దలు కొట్టేందుకూ, మరి కొందర్ని కోట గోడల్ని పునాదులతో సహా తవ్వి పారేసేందుకూ నియోగించగలను. కాని....ఆ భయంకర పక్షులు...." అంటూ గుడ్లు తేలవేశాడు.

"ఉగ్రాక్షా, నువ్వు భయపడకు! అవి మన మీద పడకుండా హడలకొట్టే పని నాది," అన్నాడు అమరపాలుడు.

"అది ఎలా సాధ్యం?" అని అడిగాడు చిత్రసేనుడు ఆశ్చర్యంగా.

"ఇవ్వాళ ఉదయం వాటి కొట్టాలకు నిప్పు పెట్టినప్పుడు, అవి నిప్పంటే ఎంత హడలుకుపోతవో తెలుసుకున్నాను. కనుక, మన సైనికుల్లో ప్రతి పదిమందిలోనూ ఒకడికి, మండుతున్న కాగడాలు ఇస్తే, వాటి రౌతులు చచ్చి గీపెట్టినా అవి మన మీదికి దుమికేందుకు సాహసించవు," అన్నాడు అమరపాలుడు. —(ఇంకావుంది)






# దోషమెవరిది?

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఎన్ని కష్టాలకైనా ఓర్చి, చేపట్టిన కార్యం సాధించి తీరాలన్న, నీ పట్టుదల మెచ్చదగిందే. కాని, ఇందుకు నిన్ను పురిగొల్పినవాడు, బాధ్యతా, సాధ్యాసాధ్యాలను గురించి ఆలోచించగల లోకజ్ఞత వున్నవాడేనా? లేక, నీకైనువ్వు, బాధ్యతారహితంగా తలకుమించిన భారాన్ని మోయడానికి సిద్ధపడ్డావా? ఇలాంటి సంశయమే, ప్రసన్నుడూ, జ్ఞానేంద్రుడూ అనే తండ్రీ కొడుకుల కథ విన్నవాళ్ళకు కలుగుతుంది. ఆ కథ చెబుతాను, శ్రమతెలియకుండా, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

## బేతాళ కథలు



పూర్వం ధరణిగిరి అనే గ్రామంలో, ప్రసన్నుడనే సంపన్న రైతు వుండేవాడు. అతడికి ఇద్దరు కొడుకులు. పెద్దవాడు జితేంద్రుడు; చిన్నవాడు జ్ఞానేంద్రుడు. జితేంద్రుడు నెమ్మదస్థుడు; జ్ఞానేంద్రుడుది దుడుకు స్వభావం.

ప్రసన్నుడు తన పొలం కౌలుకిచ్చినా, ప్రతిదినం పొలానికి వెళ్ళి, అక్కడి పనులను పర్యవేక్షిస్తూండేవాడు. పొలాన్ని కౌలు కిచ్చినంత మాత్రాన, దాన్ని గురించి పట్టించుకోకపోవడం, భూదేవిని అవమానించడమే అని, అతడి అభిప్రాయం.

జితేంద్రుడు, కూడా రోజూ పొలానికి వెళ్ళేవాడు. కొత్త పద్ధతులను అవలంబించి, పంటలను ఎలా అభివృద్ధిపరచవచ్చునో, కౌలుదార్లతో చర్చిస్తూండేవాడు. ఈ కారణం వల్ల, అతడు గ్రామంలో మంచి పేరు సంపాయించుకున్నాడు.

ఇక, జ్ఞానేంద్రుడికి మొదటి నుంచీ వ్యవసాయం పట్ల ఆసక్తి లేదు. ఎప్పుడైనా తండ్రి, ఏదైనా పని చెప్పినా, రెండు, మూడుమార్లు హెచ్చరించితే తప్ప, పొలం కేసి వెళ్ళేవాడు కాదు.

అతడి వ్యాపకమల్లా, గ్రామంలో తనలాగే పనీపాటూ లేని యువకులతో కలిసి—రాక్షసమాయల దగ్గిర్నుంచి, రాజశాసనాలవరకూ చర్చించడం. ఇందువల్ల, జ్ఞానేంద్రుడు, తండ్రి దగ్గిరే కాకుండా, గ్రామంలోని వాళ్ళచేత కూడా, ఎందుకూ పనికిరానివాడుగా తయారవుతున్నాడన్న పేరు తెచ్చుకున్నాడు. ప్రసన్నుడు, అతణ్ణి ఎన్నోసార్లు జితేంద్రుడితో పోల్చి, నచ్చజెప్పాలని చూశాడు; గట్టిగా మందలించాడు కూడా. అవేమీ జ్ఞానేంద్రుడిలో మార్పు తేలేకపోయినై.

అయితే, జ్ఞానేంద్రుడికి, తాను కాలం వృథా చేస్తున్నానన్న బాధ లేకపోలేదు. కాని, అతడికి వ్యవసాయం మీదికి మాత్రం, ఏకోశానా దృష్టి మళ్ళలేదు.

ఇలా కొన్నాళ్ళు జరిగాక, ఒకనాడు హఠాత్తుగా జ్ఞానేంద్రుడు, తండ్రి దగ్గిరకు

వెళ్ళి, "నాన్నా, మీరు చాలాసార్లు నన్ను, ఎందుకూ పనికిరానివాడుగా తయారవు తున్నానని మందలించారు. అందువల్ల, ఏం చేయాలా అని బాగా ఆలోచించి, చివరకు ఏదైనా వ్యాపారం ప్రారంభించా లన్న నిర్ణయానికి వచ్చాను. అందుకు రాజధానీనగరమే సరైనచోటు," అన్నాడు.

ఈ మాటలు విని ప్రసన్నుడు ఆశ్చర్య పోయి, "మరి, వ్యాపారానికి అవసరం అయిన పెట్టుబడి మాటేమిటి?" అని అడిగాడు.

"పెట్టుబడి కోసం, మీరు కొంత డబ్బి వ్వండి. అది మీకు ఇష్టం లేనిపక్షంలో, నా వాటా నాకు పంచవలసిందిగా కోరు తున్నాను," అన్నాడు జ్ఞానేంద్రుడు.

ఇందుకు ప్రసన్నుడు మండిపడి, "తర తరాలుగా నమ్ముకున్న భూదేవిని విడిచి పెట్టి, నగరంలో వ్యాపారం చేస్తావా? ఇది, నీకు అభివృద్ధి చెందాలన్న కోరిక వల్ల కలిగిన ఆలోచనకాదు. నగరం తళుకుబెళుకులు అనుభవించాలన్న వ్యామోహానికి, నువ్వు వేస్తున్న ముసుగు! నా బొందిలో ప్రాణం వుండగా, నీ ఆలో చన సాగనివ్వను," అన్నాడు.

జ్ఞానేంద్రుడు తండ్రి కోపానికి ఏమాత్రం జంకక, "నేను ఏ వ్యసనాలకూ, వ్యామో హాలకూ దాసుణ్ణయి డబ్బు అడగడం లేదు. వ్యాపారం చెయ్యాలన్నదే, నా స్థిర నిర్ణయం. ఇస్తే డబ్బివ్వండి, లేదా ఆస్తిలో, నా వాటా పంచియివ్వండి," అన్నాడు.





తండ్రికొడుకు లిద్దరూ, చాలా సేపు వాదులాడుకున్నారు. చివరకు సమస్య జితేంద్రుడూ, గ్రామంలోని ఇద్దరు, ముగ్గురు పెద్దల ముందు పెట్టబడింది. అక్కడ కూడా తండ్రికొడుకులు రాజీకి రాలేదు.

చివరకు పెద్దలు, ఈ విధంగా నిర్ణయించారు : ప్రసన్నుడు, జ్ఞానేంద్రుడికి కొంత డబ్బిస్తాడు. దానితో అతడు వ్యాపారం ప్రారంభించవచ్చు. అందులో, సంవత్సరం ముగిసేసరికి, ఏదో కొంత కనీసలాభం చూపించాలి. అలా అయితేనే, ప్రసన్నుడు, జ్ఞానేంద్రుడు వ్యాపారం కొనసాగించడానికి అంగీకరిస్తాడు. లేనిపక్షంలో, జ్ఞానేంద్రుడు వ్యాపారం వదిలేసి, అన్న జితేంద్రుడికి వ్యవసాయంలో సాయపడాలి.

జ్ఞానేంద్రుడు ఇందుకు అంగీకరించాడు. ప్రసన్నుడు అయిష్టంగానే కొడుకుకు డబ్బిచ్చాడు.

జ్ఞానేంద్రుడు రాజధానీనగరం ప్రయాణమై వెళ్ళబోతూ, తల్లిదండ్రులిద్దరికీ నమస్కరించి, ఆశీస్సులు కోరాడు. తల్లి కళ్ళు తుడుచుకుంటూ, ఆశీర్వదించింది. అయితే, ప్రసన్నుడు, ''వెళ్ళిరా! ఈ విషయంలో నీకు, నా ఆశీస్సులు మినహా, ఎటువంటి సహాయసహకారాలు వుండవు,'' అన్నాడు కటువుగా.

జ్ఞానేంద్రుడు రాజధానీనగరం చేరి, వెళ్ళిన ఆరునెలల్లోనే పెట్టుబడి డబ్బు పోగొట్టుకుని, కొత్తగా అలవాటైన మధుపానం లాంటి దురలవాట్లతో, ఆరోగ్యం పాడై, ఇల్లు చేరాడు.

తల్లి, అతణ్ణి చూసి కళ్ళనీరు నింపుకున్నది. తండ్రి మాత్రం కోపంగా, ''నమ్మవలసిన భూమాతను వదిలి, ఎడారుల వెంట పరుగులు తీశావు. ఇప్పటికైనా బుద్ధి కుదిరిందా ?'' అంటూ మందలించి, జ్ఞానేంద్రుడికి మంచి వైద్యులచేత చికిత్స చేయించాడు.

కొన్నాళ్ళ తర్వాత, జ్ఞానేంద్రుడి ఆరోగ్యం కుదుటపడింది. ప్రసన్నుడు,

అతడితో. ''ఇప్పటికి కలిగిన అనుభవాలు. చాలు! రేపటినుంచీ జితేంద్రుడితోపాటు. పొలానికి వెళుతూ వుండు. వాడే నీకు సేద్యంలోని మెలుకువలన్నీ నేర్పుతాడు." అన్నాడు.

జ్ఞానేంద్రుడు అయిష్టంగానే వ్యవసాయంలో ప్రవేశించాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, ఈ తండ్రికొడుకుల మధ్య జరిగిన ఘర్షణలో, ఎవరు సహజంగా, బాధ్యతాయుతంగా ప్రవర్తించారు? వాళ్లకు కలిగిన మనస్తాపానికీ, ధననష్టానికీ, దోషమంతా ఒక్కరిదా? లేక ఇద్దరిదీనా? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''ఇందులో దోషమంతా పూర్తిగా ప్రసన్నుడిదే! జ్ఞానేంద్రుడు స్వతహాగా మంచివాడు; తెలివైనవాడు. అటువంటి కొడుకు ఇష్టాయిష్టాల్ని తెలుసుకుని, అందుకు తగిన వాతావరణం ఏర్పరచడం, తండ్రి మీద వున్న బాధ్యత. తను రైతు అయితే, కొడుకు కూడా ఇష్టం లేకపోయినా, రైతే అయితీరాలన్న పట్టుదల అర్థం లేనిది. తన అభిరుచుల్ని, ఆశయాల్ని కొడుకు మీద రుద్ది, అతడి వ్యక్తిత్వాన్ని నాశనం చెయ్యడం ఏ తండ్రీ చేయకూడనిది. జ్ఞానేంద్రుడి దృష్టి వ్యాపారం మీద వున్నదని తెలియగానే, ప్రసన్నుడు అతడిని ఎవరైనా ఒక నమ్మకస్థుడైన వ్యాపారికి అప్పజెప్పి, శిక్షణ యిప్పించి వుండవలసింది. అలా చేయనందువల్ల, అనుభవ శూన్యుడైన జ్ఞానేంద్రుడు, నాగరిక ప్రపంచంలో సర్వసామాన్యమైన మోసాలకు గురై, చివరకు తనకేమాత్రం ఇష్టం లేని పనిలో ప్రవేశించాడు. ఇందుకు కేవలం ప్రసన్నుడి బాధ్యతారహిత ప్రవర్తనే కారణం,'' అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)





# పాలరుచి

ధవళపురిని పాలించే రాజు సువర్ణవర్మకు, అరణ్యంలో తపస్సు చేసుకుంటున్న సూర్యదేవుడనే ఋషిని గురించి తెలియ వచ్చింది. ఆ ఋషి గొప్ప తపశ్శాలి; మహా జ్ఞాని. రాజుకు, ఆయనను దర్శించి, కనీసం ఒక రోజైనా, ఆయన సన్నిధిలో కాలం గడపాలన్న కోర్కె కలిగింది. ఇందుకు సూర్యదేవుడి నుంచి అనుమతి పొందేందుకు, రాజు తన మంత్రిని, ఆయన దగ్గిరకు పంపాడు.

సూర్యదేవుడు, మంత్రి చెప్పింది విని, "మీ రాజు చక్కని న్యాయపాలకుడని విన్నాను. ఇప్పుడాయనకు, నా ఆశ్రమంలో ఒక రోజు గడపాలన్న కాంక్ష కలిగిందంటే—బహుశా ధర్మజిజ్ఞాసకలవాడై కూడా వుండాలి. అలా కానప్పుడు, ఎంతో సౌఖ్యంగా వుండే హంసతూలికాతల్పాలనూ, భవనాన్నీ విడిచి, నా పూరిపాకలో విశ్రమించాలని కోరుకోడు. ఆయనను, నేనిక్కడికి ఆహ్వానిస్తున్నానని చెప్పండి," అన్నాడు.

సూర్యదేవుడి జవాబుకు మంత్రి చాలా సంతోషించాడు. ఆ సమయంలో, ఆశ్రమవాసి ఒకడు ఆయనకు, ఒక లోటాలో పాలు తెచ్చి యిచ్చాడు. ఆ పాల రుచి ఆయనకు అద్భుతం అనిపించింది.

మంత్రి, ఆశ్రమవాసిని, "ఇంత రుచి గల పాలు, నేనెన్నడూ తాగి వుండలేదు. ఈ పాలు ఇచ్చిన ఆవు, చాలా మేలు జాతిదై వుండాలి, అవునా?" అని అడిగాడు.

"ఇవి, మా గురువుగారు ఎక్కువగా అభిమానించే ఆవుపాలు," అన్నాడు ఆశ్రమవాసి.

మంత్రి మరి కొంతసేపు ఆశ్రమంలో వుండి, రాజధానికి తిరిగి వచ్చాడు.

మనోజ్‌దాస్

మర్నాడు అయినా, రాజు సువర్ణవర్మ, ఋషి ఆశ్రమానికి వెళ్ళారు. ఋషి, రాజును ఆదరంతో దీవించి, కూర్చునేందుకు ఒక దర్భాసనం చూపించాడు. తర్వాత ఒక శిష్యుణ్ణి పిలిచి, రాజుకు తాగేందుకు పాలు ఇవ్వవలసిందిగా ఆదేశించాడు.

శిష్యుడు లోపలి గదుల్లోకి పోతూండగా మంత్రి అతడితో చిన్నగా, "రాజుగారికి అవే పాలు తీసుకురండి—అంటే, మీ గురువుగారు ప్రేమగా చూసుకునే ఆవు ఇచ్చే పాలు!" అని చెప్పాడు.

"ఆ పాలే తెస్తాను. గురువుగారు కూడా అతిథులకు దాని పాలే తెచ్చియివ్వమంటారు," అన్నాడు శిష్యుడు.

తర్వాత అతడు రెండు లోటాలలో పాలు తెచ్చి, ఒక దానిని రాజుకు ఇచ్చి, రెండవదానిని మంత్రికి ఇస్తూ, "అయ్యా, ఇవి కూడా, మీరు చెప్పిన ఆవుపాలే!" అన్నాడు.

మంత్రి లోటాలో నుంచి, ఒక గుక్కెడు పాలు తాగి, ముఖం అయిష్టంగా పెట్టి, శిష్యుణ్ణి ఒకపక్కకు తీసుకుపోయి, "నిజంగా ఇవి, ఆ ఆవుపాలేనా? ఏదైనా పొరబాటు జరగలేదుకదా?" అని అడిగాడు.

"పొరబాటేం లేదు. ఆ పాలతో రెండు లోటాలు నింపి, ఒకటి రాజుగారికీ, రెండవది మీకూ ఇచ్చాను," అన్నాడు శిష్యుడు.



రాజు ఇదేం గమనించకుండా, లోటా లోని పాలు కొంచెం కొంచెంగా తాగుతూ, ఋషి చెప్పే నైతిక, ధార్మిక విషయాలు చెవులప్పగించి వింటున్నాడు.

కొద్ది సేపటి తర్వాత ఋషి, ఏదో పని మీద లేచి, లోపలిగదిలోకి వెళ్ళాడు. అప్పుడు మంత్రి, రాజును, "ప్రభూ, పాలరుచి ఎలా వున్నది?" అని అడిగాడు.

"అద్భుతం! అద్భుతం!" అన్నాడు రాజు.

ఆ జవాబు విని మంత్రి నిస్పృహగా, "ప్రభూ, మీరన్నట్టు, నిన్న నాకూ పాల రుచి అద్భుతం అనిపించింది. అందుకే ఆ ఆవును ఋషి నుంచి కొనాలనుకున్నాను. ఒకవేళ ఆయన, దానికి వెయ్యి వరహాలిమ్మన్నా, సంశయించక యిద్దామనే నిశ్చయించుకున్నాను. కాని, ఆశ్చర్యమేమంటే—ఇవ్వాళ పాలరుచి అతి సామాన్యంగా వున్నది," అన్నాడు.

ఆ మాటలు విని రాజు సువర్ణవర్మ, ఒక క్షణకాలం మౌనంగా వుండిపోయి, తర్వాత ప్రశాంతంగా, "మహామంత్రీ, ఆ పాలు నిన్న అద్భుతమైన రుచిగా వుండడానికి కారణం, మీకు, ఋషిపట్ల కలిగిన కృతజ్ఞతాభావం. అయితే, వెంటనే మీకు మైకం వదిలి మెలుకువ వచ్చింది! మీలో దాగివున్న స్వార్థం అనే విషకీటకం, ఋషి దయాగుణాన్ని మరిచి, పాల విలువను వరహాలలో గుణించసాగింది. మరి, మీకీనాడు, పాలరుచి అద్భుతంగా ఎందుకుంటుంది!" అన్నాడు.

మంత్రి సిగ్గుతో తల వంచుకున్నాడు.

అప్పుడు రాజు గంభీరంగా, "ఈ పర్ణశాలలో, ఋషి పాదాలచెంత, ఒక రోజు ప్రశాంతంగా గడపాలని వచ్చాను. అంతే గాని, పాలరుచీ, లాభనష్టాల గురించీ ఆలోచించడానికి కాదు. మీరు నన్నిక్కడ ఒంటరిగా వదిలి వెళ్ళండి," అన్నాడు.

మంత్రి లేచి ఆశ్రమ కుటీరం నుంచి బయటికి వెళ్ళిపోయాడు. కొద్దిసేపు తర్వాత, ఋషి ప్రశాంతవదనంతో చిరునవ్వునవ్వుతూ, రాజు దగ్గిరకు వచ్చాడు.






మన దేవాలయాలు :

# కామాక్షి మందిరం

"జగదంబ కామాక్షి పేరుతో అజ్ఞాపిస్తున్నాను! ఇలా చెయ్!" అంటూ మాంత్రికులు, తమ మంత్రవిద్యలను ప్రదర్శించేవారు. అస్సాంలో గౌహతి నగరానికి సమీపంలో నీలపర్వతం మీద వెలుగొందే కామాక్షిదేవి, భక్తులకు మంత్రశక్తులను ప్రసాదిస్తుందన్న విశ్వాసం వున్నది.

దక్షయజ్ఞం తరవాత, శివుడు సతీదేవి భౌతికకాయాన్ని ఎత్తుకుని భూప్రపంచమంతా తిరిగినప్పుడు, ఈ కొండ మీద సతీదేవి అంగం ఒకటి పడిందనీ, దాని మీదే ఈ గుడి నిర్మించబడిందనీ భక్తులు విశ్వసిస్తారు. పూర్వకాలంలో గుడి భయంకర అరణ్యం మధ్య ఉండడం వల్ల మామూలు ప్రజలు అక్కడికి వెళ్ళడానికి చాలా కష్టపడవలసి వచ్చేది.





పదునారవ శతాబ్దంలో కాలాపహర్ సైనికులు దేవాలయాన్ని నాశనం చేశారు. సైనికులు హఠాత్తుగా అలయాన్ని ముట్టడించడం వల్ల, ఆ ప్రాంతపు రాజులు ఆ అలయాన్ని రక్షించడానికి ఏమీ చేయలేకపోయారు. తదనంతరం సంవత్సరాల తరబడి ఈ దేవాలయం, ఒకరిద్దరు పూజారులతో తప్ప, దాదాపు నిర్మానుష్యంగానే ఉండిపోయింది.




కొన్నాళ్ళ తరవాత మల్లదేవుడనే అస్సాం రాజు, బెంగాలు నవాబు మీదకి దండెత్తాడు. అతడు యుద్ధంలో ఓడిపోయి నవాబుకు బందీగా పట్టుబడిపోయాడు. నవాబు అతన్ని కోటలో బంధించాడు.

ఒకనాడు మల్లదేవుడు గాఢనిద్రలో ఉన్నప్పుడు ఒక కల వచ్చింది. ఆ కలలో దేవి ప్రత్యక్షమై, "రాజా! నీ రాజ్యం సరిహద్దుల లోపలే నీ రాజ్యాధిదేవత ఆలయం పాడుబడి ఉన్నది. దానిని బాగుచేయించడం మాని, ఇలా పొరుగు రాజు మీదికి దండెత్తి వచ్చి పట్టుబడిపోవడం సిగ్గుగాలేదా?" అన్నది.





రాజు నిద్రలేచి, తన తప్పును గ్రహించాడు. అతడు అక్కడి నుంచి బయటపడే ఉపాయం కూడా కామాక్షిదేవి కలలో సూచించింది. ఆ రోజు ఉదయమే నవాబు తల్లి ఉద్యానంలో విహరిస్తుండగా, పాము కరిచి, స్పృహతప్పి పడిపోయింది.

ఆస్థాన వైద్యులందరూ వచ్చి నవాబు తల్లిని కాపాడడానికి ఎంతగానో ప్రయత్నించారు. కాని ఆమె స్థితి మెరుగుపడలేదు. నవాబు తల్లిపట్ల చెప్ప లేనంత అభిమానం కలవాడు. తల్లి పరి స్థితి చూసి ఆయన విషాదం చెందాడు.





ఇక వైద్యులు ఏమీ చేయలేరని తెలిసిపోయాక, నవాబు తన తల్లి ప్రాణాలు రక్షించినవారు ఏమి కోరు కున్నా తీరుస్తానని సభలో ప్రకటిం చాడు. అయినా సభికులలో ఒక్కరు. కూడా ముందుకు రాలేదు.

చెరసాలలో ఉన్న రాజు, కాపలా భటు డితో, "నన్ను చెర నుంచి విడిచిపెట్టే పక్షంలో, నేను నవాబు తల్లి ప్రాణాలు రక్షించగలనని నవాబుతో చెప్పు," అని నవాబుకు కబురు చేశాడు. నవాబు, రాజు నిబంధనకు అంగీకరించి, అతనిని రప్పించాడు.





రాజు, కలలో కామాక్షిమాత ఉపదేశించిన మంత్రం పఠించగానే, నవాబు తల్లి నిద్ర నుంచి మెలకువ వచ్చినట్టు లేచి కూర్చున్నది. నవాబు అమితానందంతో రాజును కౌగిలించుకున్నాడు. విలువైన కానుకలు ఇచ్చి, రాజుకు గౌరవంగా వీడ్కోలు పలికాడు.

రాజు తన రాజధానీనగరానికి చేరగానే, వెన్నతో కాల్చిన ఇటుకలతో కామాక్షిదేవి ఆలయ పునర్నిర్మాణానికి పూనుకుని, అచిరకాలంలోనే పూర్తిచేశాడు. ఆయన జీవితాంతం దేవీభక్తుడుగా గడిపాడు; దేవాలయ పూజాదికార్యక్రమాలకు కావలసిన ఏర్పాట్లు చేశాడు.






అనాటి నుంచి ఆలయానికి క్రమంగా భక్తులు రాసాగారు. ఈ దేవాలయ గర్భగృహంలో ఒక నల్లరాయి, దేవీవిగ్రహానికి ప్రతీకగా ఉంటున్నది. ఆలయ ప్రాంగణం ఎప్పుడూ జీవకళతో కళకళలాడుతూ ఉంటుంది.



# పనికిరాని శాసనం

లవంగపురం మహారాజు శాంతగుప్తుడు, మతానికి సంబంధించిన ఆచారాలన్నిటినీ, ఎంతో భక్తిశ్రద్ధలతో పాటిస్తూండేవాడు. ముఖ్యంగా ఆయనకు సాధువులన్నా, సన్యాసులన్నా వల్లమాలిన భక్తి గౌరవాలుండేవి. వాళ్ళంతా భగవంతుడి ప్రతినిధులని, ఆయన నమ్మకం. తన రాజ్యంలోని ప్రజలు కాని, రాజోద్యోగులు కాని, వాళ్ళకు ఎలాంటి కష్టమూ గలగకుండా గౌరవించాలని శాసనం చేయడమే కాక, రాజ్యంలోని సాధుసన్యాసులందరికీ ఉచితంగా భోజనం, వసతీ లభించేలాగా సకల.విధ సౌకర్యాలు కూడా ఏర్పాటు చేయించాడు.

ఇది జరిగిన కొన్నాళ్ళకు మంత్రి మాధవవర్మ, రాజుతో, ''ప్రభూ, తమరు చేసిన శాసనంవల్ల, మన ఆదాయంలో సగానికి పైగా, సాధుసన్యాసుల అవసరాలకే ఖర్చయిపోతున్నది. అందువల్ల, ప్రజల క్షేమంకోసం అభివృద్ధి పనులేవీ చేపట్టేందుకు అవకాశం కలగడం లేదు. మరొక ముఖ్యమైన సంగతి : ఈ శాసనం అమలులోకి వచ్చినప్పటి నుంచీ, ఏనాడూ లేనంతగా నేరాల సంఖ్య పెరిగింది,'' అన్నాడు.

మంత్రి చెప్పినది విన్న రాజు శాంతగుప్తుడు, అయిష్టంగా తలాడిస్తూ, ''నేను చేసిన సాధురక్షణ శాసనమే, ఈ పరిస్థితికి కారణం అని మీరు నమ్మడం, భగవత్ స్వరూపులైన సాధుసన్యాసుల్ని అవమానించడం అవుతుంది. ఈ సాధుసేవ వల్ల, మన రాజ్యానికి తప్పక మేలు కలుగుతుందని, నా దృఢమైన నమ్మకం!'' అన్నాడు.

మంత్రి కొంచెంసేపు మౌనంగా వూరుకుని, ''ప్రభూ, ఉన్నపరిస్థితి తమకు

జొన్నలగడ్డ రత్న



గలిగితే—తిరిగి మన కోశాగారం పుష్కలంగా నిండుతుంది,'' అన్నాడు.

మంత్రి, రాజు చెప్పినట్టే దేశమంతటా దండోరా వేయించాడు.

కొన్నాళ్ళు గడిచాక శాంతగుప్తుడు, మంత్రిని పిలిచి, ''కోశాగారం పరిస్థితి ఇప్పుడెలా వున్నది? ప్రజలు, నా ఉత్తరువును పాటిస్తున్నారా?'' అని అడిగాడు.

అందుకు మంత్రి, ''ప్రభూ, ఏమని మనవి చేసేది! కోశాగారం పరిస్థితి మరింతగా దిగజారిపోతున్నది,'' అన్నాడు.

ఈ జవాబుకు రాజు ఆశ్చర్యపోయి, ''దీనినిబట్టి చూస్తే, ప్రజలు నా ఆజ్ఞను శిరసావహించడం లేదని తెలుస్తున్నది. ఇలా ఎందుకు జరుగుతున్నదో మనం తెలుసుకోవాలి. ఇవ్వాళే, మారువేషాల్లో దేశసంచారానికి బయలుదేరుదాం,'' అన్నాడు.

ఆ విధంగా రాజూ, మంత్రీ మారువేషాల్లో, ఒక చిన్న పట్టణంలో తిరుగుతూ, ఒక బట్టలు నేసేవాడి ఇంట, మగ్గం చుట్టూ కూర్చుని కొందరు తీరికగా ఉబుసుపోని కబుర్లు చెప్పుకుంటూ ఉండడం చూశారు.

వాళ్ళిద్దరూ, అక్కడికి వెళ్ళి, ''పనీ పాటూ మాని, ఇలా సోమరులుగా కాలక్షేపం చేసేవారిని, ఈ దేశంలో రాజుగారు

మనవిచేయడం, నా బాధ్యత కదా,'' అన్నాడు.

రాజు అవునన్నట్టు తల వూపి, ''రాజగురువులు, గత సంవత్సరకాలంగా దేశాటనలో వున్నారు. సాధువుల రక్షణ కోసం నేను శాసనం చేసేముందు, అనుభవజ్ఞులైనవారి సలహా తీసుకునే అవకాశం నాకు కలగలేదు. సరే, ఇప్పుడొక పని చేయండి. ప్రజలందరూ విశేషించి కష్టపడి పని చేస్తూ, సకాలంలో పన్నులు చెల్లించాలనీ; ఎవరైనా సోమరులుగా కనబడితే కఠినంగా శిక్షింపబడతారనీ, దేశమంతటా దండోరా వేయించండి. ఈ ఉత్తరువు కనక కఠినంగా అమలు చేయ

కఠినంగా శిక్షిస్తారని విన్నాము. మరి, మీరా సంగతి ఏమీ పట్టించుకున్నట్టు లేదే!'' అన్నారు.

ఆ మాటలకు మగ్గం చుట్టూ వున్న వాళ్ళు పెద్దగా నవ్వి, ''మీరెవరో, ఈ దేశానికి కొత్తవాళ్ళలా వున్నారు!'' అని, రాజూ మంత్రులకు, అక్కడ గోడకు వేళ్ళాడుతున్న దండ కమండలాలనూ, కాషాయవస్త్రాలను చూపించి, ''రాజుగారి శాసనాన్ని ధిక్కరించామని ఎవరైనా మమ్మల్ని పట్టుకోచూస్తే, క్షణాల మీద సన్యాసుల్లాగా, సాధువుల్లాగా వేషాలు మార్చుకోగలం. ఈ దేశంలో సోమరులకు శిక్ష వున్నమాట నిజమే కాని, సాధుసన్యాసులకు అది వర్తించదు. అంతే కాక, ఎలాంటి నేరం చేసినా, ఆ వేషాల్లో కనపడగలిగితే, రాజమర్యాదలు కూడా జరుగుతవి,'' అన్నారు.

''ఓహో, అదా సంగతి!'' అని, రాజు శాంతగుప్తుడూ, మంత్రీ అక్కడి నుంచి బయలుదేరారు.

ఆ తర్వాత రాజూ, మంత్రీ దేశంలో చాలా ప్రాంతాలు తిరిగారు. ప్రతిచోటా వాళ్ళకు దాదాపు ఇటువంటి అనుభవాలే ఎదురయినై.

రాజూ, మంత్రీ రాజధానికి తిరిగి వచ్చారు. ప్రజల మేలుకోరి తాను చేసిన శాసనం, ఇలా ఎందుకు వ్యర్థమైపోయిందో అర్థం కాక, రాజుకు విచారం పట్టుకున్నది. ఆ సమయంలో అయనకు,



రాజగురువు దేశాటన నుంచి తిరిగి వచ్చినట్టు తెలిసింది. వెంటనే మంత్రిని వెంట బెట్టుకుని, రాజు ఆయనను చూడబోయాడు.

రాజగురువు, శాంతగుప్తుడు చెప్పిన దంతా విని, "రాజా, ఒక లక్ష్యం, ఆదర్శం అంటూ లేకుండా, అనాలోచితంగా చేసే శాసనాలు—అటు ప్రజలకూ, రాజుకూ కూడా శాపాలుగా పరిణమించగలవు. లోకకల్యాణం కోసం సర్వసంగపరిత్యాగం చేసిన మహానుభావుల్ని, వేళ్ళ మీద లెక్కించవచ్చు!" అన్నాడు.

"గురుదేవా, రోజూ మనం ఎంతో మంది సాధుసన్యాసుల్ని చూస్తూంటాం గదా!" అన్నాడు రాజు శాంతగుప్తుడు.

దానికి రాజగురువు చిన్నగా నవ్వి, "అందులో నిజమైన సాధువుల్ని గుర్తించడం, అంత తేలికైన సంగతి కాదు. వాళ్ళల్లో చాలామంది, కుటుంబం పట్ల తమకున్న బాధ్యతల నుంచి, తప్పించుకునేందుకూ, సుఖమయమైన జీవితం గడిపేందుకూ కాషాయవస్త్రాలు ధరించిన వాళ్ళు. నీ శాసనం ద్వారా అలాంటి వాళ్ళకు ప్రోత్సాహం కలిగి, ప్రజల్లో సోమరితనానికీ, అరాజకానికీ కారణం అయింది!" అన్నాడు.

రాజు శాంతగుప్తుడు ఎంతో వినయంగా, "గురుదేవా, పనికిరానిశాసనాన్ని రద్దు చేయమనేగదా, తమరనేది? అలాగే చేస్తాను," అన్నాడు.

"రాజా, ఆ పని ఎంత త్వరగా చేస్తే అంత మంచిది. మరొక సంగతి గుర్తుంచుకో; ఇక నుంచి మతాచారాలను పాటించే విషయంలో, నీ నమ్మకాలను ప్రజల మీద శాసన రూపంలో ప్రయోగించకు," అని రాజగురువు సలహా ఇచ్చాడు.

రాజు ఆ రోజునే సాధుసన్యాసులకు, ఉచితభోజనవసతి సౌకర్యాలను పూర్తిగా రద్దు చేస్తూ, సోమరులు కఠినంగా శిక్షింపబడగలరని, దేశమంతటా చాటింపు వేయించాడు.





# ఉత్తరరామాయణం

యముడితో యుద్ధానికి బయలుదేరిన రావణుడు యమలోకాన్ని చేరవచ్చి, అక్కడ నరకయాతనలనుభవిస్తున్న పాప కర్ములనూ, స్వర్గసుఖా లనుభవిస్తున్న పుణ్యకర్ములనూ చూశాడు.

ఘోరాకారులూ, క్రూరులూ, అతి భయంకరులూ అయిన యమకింకరులు, బలవంతంగా పాపులను పురుగుల చేత తినిపిస్తున్నారు. కుక్కల చేత భయంకరంగా కరిపిస్తున్నారు, వైతరణీనదిలో ఈదిస్తున్నారు, కాలిన ఇసుక దిబ్బల మీద వేసి బాధిస్తున్నారు. నరక యాతన లనుభవించేవారు శవాల లాగా ఉండి, బాధతోనూ, దప్పికతోనూ చెప్పలేనంతగా అలమటిస్తున్నారు. మరొక వంక పుణ్యం చేసుకున్నవారు పుణ్యఫలాన్ని సమస్త సుఖాల రూపంలోనూ పరమానందంతో అనుభవిస్తున్నారు.

రావణుడు లక్షలాదిగా గల పాపులు అనుభవించే యాతనలను చూసి జాలి పడి, వారిని విడిపించ నారంభించాడు. అది చూసి యమదూతలకు కోపం వచ్చింది. వాళ్ళు రావణుడి పైకి వెళ్ళి, పరిఘలూ, శూలాలూ, ముసలాలూ, శక్తులూ, తోమరాలూ పుష్పకం మీదికి విసిరారు. కొందరు తేనెటీగల్లాగా పుష్పకం మీదికి ముసిరి, అందులోని ఆసనాలూ, వేదికలూ, మంటపాలూ విరిచి పారెయ్య సాగారు. అయితే అది అక్షయమైన విమానం కావటం చేత, వారెంత నాశనం

5. పాతాళబలిసందర్శనం



చేసినా ఎప్పటిలాగే చెక్కు చెదరకుండా ఉన్నది.

ఈ లోపుగా నారదుడు తిన్నగా యముడి వద్దకు వెళ్ళాడు. యము డాయనను సగౌరవంగా అర్ఘ్యపాద్యాలతో సత్కరించి, క్షేమమడిగి, వచ్చిన పని తెలుసుకో గోరాడు.

"యమరాజా, దశగ్రీవుడనే అజేయుడైన రాక్షసుడు నిన్ను జయించి, వశపరుచుకోవటానికి నీపైకి యుద్ధానికి వస్తున్నాడు. నీ యమదండం ఏం కానున్నదో!" అన్నాడు నారదుడు. అయన అలా అంటుండగానే దూరాన వెలిగిపోతూ పుష్పకం కనబడింది.

రావణుడు యమకింకరులతో కొంత సేపు యుద్ధం చేసి, చివరకు వారి పైన పాశుపతాస్త్రం ప్రయోగించాడు. అది కార్చిచ్చు లాగా ఆ ప్రాంతాన ఉండే చెట్లనూ, పొదలనూ బూడిద చేస్తూ, తన జ్వాలలను అన్ని వైపులకూ వ్యాపింప జేసింది. యమదూతలు ఆ జ్వాలలలో మిడతల్లాగా మాడిపోయారు. రావణుడూ, అతని మంత్రులూ దిక్కులు పిక్కటిల్లేటట్టు భయంకరమైన కేక పెట్టారు.

ఆ కేక విని యముడు, యుద్ధంలో రావణుడు జయించాడని గ్రహించి, తన సారథిని పిలిచి, తన రథాన్ని యుద్ధానికి ఆయత్తపరచమన్నాడు. క్షణంలో ఎర్రని గుర్రాలు పూన్చిన రథం వచ్చింది. మృత్యుదేవత పాశాన్నీ, ముద్గరాన్నీ ధరించి, రథంలో యముడి ముందు నిలిచింది. యముడు రథంలో ఎక్కి కూర్చుంటే ఒక పక్కన కాలదండమూ, రెండో పక్క కాలపాశాలూ ఉన్నాయి. ఈ విధంగా యముడు యుద్ధానికి బయలుదేరేసరికి, మూడు లోకాలూ సంక్షోభం పొందాయి. దేవతలు కంపించారు.

మనోవేగం గల రథాశ్వాలు యముడి రథాన్ని క్షణంలో రావణుడి ముందుకు తెచ్చాయి. మృత్యుదేవతతో సహా అతి భయానకంగా ఉన్న యమరథాన్ని



చూస్తూనే రావణుడి మంత్రులు భయ విభ్రాంతులై, నాలుగు దిక్కులకూ పారి పోయారు. రావణుడు మాత్రం లేశమాత్ర మైనా భయపడక, అక్కడే స్థిరంగా నిల బడ్డాడు.

ఇద్దరికీ ఏడు రాత్రులపాటు మహా భయంకరమైన యుద్ధం జరిగింది. యముడు తాను ప్రయోగించిన అస్త్రాలతో రావణుణ్ణి మహా తీవ్రంగా గాయపరిచాడు. కాని రావణుడు ఓడిపోనూలేదు, రణ రంగం నుంచి పారిపోనూ లేదు. పైగా మిక్కిలి అతను తన బాణాలతో యముణ్ణీ, మృత్యుదేవతనూ, సారథినీ కూడా ఎంతో నొప్పించాడు.

అది చూసి మృత్యువు యముడితో, "యమధర్మరాజా, ఈ రాక్షసుడితో నన్ను యుద్ధం చెయ్యనీ. వీణ్ణి క్షణంలో చంపే స్తాను. చంపటం నా హక్కు. నేను ఎందరో రాక్షసుల చావు చూశాను. ప్రళయ కాలంలో లోకాలకు లోకాలే నాశనం కావటం చూశాను. ఇత డనగా ఎంత?" అన్నది.

"నువు ఊరికే చూస్తూ ఉండు. వీణ్ణి నేనే చంపుతాను," అంటూ యముడు కాలదండాన్ని పట్టి ఎత్తాడు. అది మంటలు కక్కుతూ మహాభయంకరంగా కన బడింది. యముడు దాన్ని రావణుడి పైకి విసరబోతూ వుండగా బ్రహ్మ ప్రత్యక్షమై, "యమధర్మరాజా, దాన్ని ప్రయోగించకు. దీనితో రావణుడు చచ్చినట్టయితే నేను వాడికిచ్చిన వరం అబద్ధమవుతుంది. వాడు చావనట్టయితే ఈ కాలదండాన్ని నేను సృష్టించిన ఉద్దేశం అబద్ధ మవుతుంది. మృత్యువుతో బాటు నేనీ దండాన్ని అమో ఘంగా ఉండేలాగు పూర్వం సృష్టించాను. అందుచేత, కాలదండాన్ని రావణుడి పైన ప్రయోగించావంటే ఒక విధంగా, కాకపోతే మరొక విధంగా నా మాట వ్యర్థమైపోతుంది," అన్నాడు.

బ్రహ్మ మాట మన్నించి యముడు కాలదండాన్ని అవతల పెట్టేశాడు.

రావణాసురుణ్ణి చంపటానికి తనకు అవకాశం లేని పక్షంలో తాను యుద్ధరంగంలో ఏం చెయ్యాలో తెలియక, యముడు తన రథంతో సహా అంతర్థానమై బ్రహ్మతో స్వర్గానికి వెళ్ళిపోయాడు.



రావణుడు తాను యముణ్ణి జయించానని ప్రకటన చేసి పుష్పకంలో యమపురం వెళ్ళిపోయాడు. ఇదంతా కళ్ళారా చూసిన నారదుడు పరమానందం చెందాడు.

యముణ్ణి జయించి, మారీచుడు మొదలైన మంత్రుల చేత ప్రశంస లందుకుని, రావణుడు పుష్పకంలో పాతాళ లోకానికి బయలుదేరి, వరుణుడి పరిపాలనలో ఉన్న సముద్రంలో ప్రవేశించి, వాసుకి మొదలైన నాగు లుండే భోగవతీ నగరాన్ని స్వాధీనం చేసుకుని, నివాతకవచు లుండే మణిమతి అనే నగరానికి వెళ్ళాడు. రకరకాల ఆయుధాలు కలిగి, అజేయులైన నివాతకవచులు రావణుడితో యుద్ధానికి తలపడ్డారు.

ఒక్క సంవత్సరం పాటు యుద్ధం సాగినా జయాపజయాలు తేలలేదు. అప్పుడు బ్రహ్మ విమానం మీద అక్కడికి వచ్చి, ఉభయ పక్షాలకూ సంధిచేసి, అగ్ని సాక్షిగా వారి మధ్య స్నేహం నెలకొల్పి వెళ్ళిపోయాడు. రావణుడు నివాతకవచులకు ఏడాదిపాటు అతిథిగా ఉండి, తన సొంత నగరంలో ఉన్నట్టే సుఖంగా కాలం పుచ్చి, నివాతకవచుల వద్ద తనకు తెలియని మాయలు తొంభైతొమ్మిది నేర్చుకుని, వరుణు డుండే నగరాన్ని వెతుకుతూ బయలుదేరాడు.

దారిలో అతనికి కాలకేయు లుండే అశ్మనగరం తగిలింది. అక్కడ రావణుడికీ కాలకేయులకూ యుద్ధ మయింది. రావణుడు కాలకేయ వీరులను చాలా మందిని చంపాడు. అలా చచ్చినవారిలో విద్యుజ్జిహ్వు డనేవాడు, శూర్పణఖ భర్త కూడా ఉన్నాడు. వాడు బలగర్వితుడు. మెరపు లాగా తన నాలుకను చాచి రాక్ష



డికి వాహనమైన నంది కామధేనువుకు పుట్టినదే.

అలాటి కామధేనువుకు రావణుడు భక్తితో ప్రదక్షిణం చేసి, వరుణ మందిరాన్ని సమీపించాడు. వరుణుడి యోధులు రావణుడితో యుద్ధం చేశారు. రావణుడు వారి నాయకులను సునాయాసంగా చంపి, యోధులతో, ''రావణుడు యుద్ధం చెయ్య వచ్చాడని వరుణుడితో చెప్పండి,'' అన్నాడు.

వరుణుడి కొడుకులూ, మనమలూ తమ పరివారాలతో సహా రథా లెక్కి రావణుడి పైకి వచ్చి, ఒక్క తృటిలో రావణుడి చేతిలోనూ, అతని మంత్రుల చేతిలోనూ ఓడిపోయారు. తమ పరివారం నశించాక వరుణ పుత్రులు వీరోచితంగా పోరాడి, తాము కూడా దెబ్బ తిన్నారు. తరవాత రావణుడు వరుణుడికి కబురు చెయ్యగా, వరుణుడు ఇంట లేడనీ, ఆయన సంగీతం వినటానికి బ్రహ్మ లోకానికి వెళ్ళాడనీ తెలిసింది.

రావణుడు తాను గెలిచినట్టు ప్రకటన చేసి, పుష్పకం మీద ఎక్కి తిరిగి అశ్మ నగరానికి వచ్చాడు. అక్కడ అతను మద గర్వితుడై విహరిస్తూండగా అతని కొక అద్భుతమైన భవనం కనబడింది. దానికి అలంకారాలుగా వైడూర్య తోరణాలూ,

సులను నాకేసేవాడు. రావణుడు వాణ్ణి కత్తితో నరికి చంపాడు. మొత్తం మీద నాలుగు వందలమంది కాలకేయ వీరులు రావణుడి చేతిలో చచ్చారు.

అక్కడి నుంచి బయలుదేరి రావణుడు వరుణుడి మందిరానికి వచ్చాడు. ఆ భవనం తెల్లని మబ్బు లాగానూ, కైలాసం లాగానూ ఉంది. అక్కడ అనుక్షణమూ పాలధారలు స్రవించే సురభి అనే కామ ధేనువు రావణుడికి కనబడింది. దాని పాలతోనే పాల సముద్రం ఏర్పడింది. ఆ పాలసముద్రం నుంచి చంద్రుడు పుట్టాడు, అమృతంపుట్టింది. పాలసముద్రపు నురుగు తిని కొందరు మహర్షులు జీవిస్తారు. శివు

ముత్యాల జాలరులూ, బంగారు స్తంభాలూ, స్ఫటిక సోపానాలూ మొదలైనవి ఉన్నాయి.

రావణుడు ప్రహస్తుడితో, "ఇంత అందమైన ఇల్లెవరిదో కనుక్కు నిరా," అన్నాడు.

ప్రహస్తుడు మొదటి ప్రాకారం దాటి లోపలికి వెళితే ఎవరూ కనిపించలేదు. అతను అలాగే ఏడు ప్రాకారాలూ దాటి లోపలికి వెళ్ళేసరికి లోపల ఒక జ్వాల కనిపించింది. దాని మధ్య ఒక దివ్య పురుషుడున్నాడు. ఆయన సూర్యుడి లాగా వెలిగిపోతూ తేరి చూడ రాకుండా ఉన్నాడు. ఆ మహాపురుషుడు ప్రహస్తుణ్ణి చూడగానే సంతోషంతో నవ్వాడు. ఆ నవ్వు విని ప్రహస్తుడి శరీరం పులకరించింది. అతను వెంటనే రావణుడి దగ్గిరికి తిరిగి వచ్చి, తాను చూసిన దంతా వివరంగా తెలిపాడు.



సంగతి వింటూనే రావణుడు పుష్పకం నుంచి దిగి, ఆ భవనంలోకి ప్రవేశించబోయేసరికి ద్వారాన్ని పూర్తిగా ఆక్రమించి ఒక భయంకరాకారుడు ఎదురుపడ్డాడు. ఆ ఆకారం నెత్తిన చంద్రుడున్నాడు, నోట భయంకరమైన జ్వాలలు వెలువడుతున్నాయి. కళ్ళూ, పెదవులూ ఎర్రగానూ, ముఖం తెల్లగానూ ఉన్నాయి. జుట్టు పైకి లేచి ఉన్నది. దట్టమైన మీసాలూ, గడ్డమూ, పెద్ద పెద్ద కోరలున్నాయి. చేతిలో పెద్ద ముద్గర మున్నది. ఆ భయంకరాకారాన్ని చూడగానే రావణుడి శరీరమంతా జలదరించింది. ఆ ఆకారం రావణుణ్ణి చూసి, "రాక్షసుడా, భయపడకు. నీ కోరిక ఏమిటో చెప్పు," అని అడిగింది.

"నాకు యుద్ధం కావాలి," అన్నాడు రావణుడు.

"ఎవరితో యుద్ధం చేస్తావు? నాతోనా? బలితోనా?" అని ఆకారం అడిగింది.

"ఈ ఇల్లెవరిదో వారితో చేస్తాను? లేదా, నువ్వెవరితో చెయ్యమంటే వారితోనే చేస్తాను," అన్నాడు రావణుడు ఎంతో ఉత్సాహంగా.

''బలి లోపల ఉన్నాడు. కావలిస్తే ఆ మహామహుడితో నిరభ్యంతరంగా యుద్ధం చెయ్యి,'' అన్నది ఆకారం.

రావణుడు లోపలికి వెళ్ళి, సూర్యుడి లాగా వెలిగిపోతున్న బలిని తేరి చూడలేక పోయాడు. బలి రావణుణ్ణి తేలికగా ఎత్తి, తన తొడ మీద కూర్చోబెట్టుకుని, ''ఏం పని మీద వచ్చావు, బాబూ? నీ కోరిక ఏమిటో తెలిపితే నేను తీర్చుతాను,'' అన్నాడు.

''మరేం లేదు, మహానుభావా! నిన్ను పూర్వం విష్ణువు మోసం చేసి నిర్బంధంలో ఉంచాడన్నారు. నిన్ను విడిపించే శక్తి నా కున్నది. అందుచేత ఆ పని చేసి పోదామని వచ్చాను,'' అన్నాడు రావణుడు నెమ్మదిగా.

''అదా సంగతి? అయితే ఇప్పుడు నీ కొక్క చిన్న విషయం తెలియ చెప్పాలి. అదిగో అక్కడ పడి ఉన్న కుండలాన్ని ఒక్కసారి ఇక్కడికి కాస్త పట్టుకురా,'' అన్నాడు బలి.

రావణుడు దగ్గిరికి వెళ్ళి చూస్తే ఆ కుండలం ఒక పెద్ద చక్రమంత ప్రమాణంలో ఉన్నది. రావణుడు సునాయాసంగా దాన్ని ఎత్తబోయి పరాభవం పొందాడు. అది కదలలేదు. రావణుడు తన రెండు చేతులతోనూ, బలమంతా ఉపయోగించి కూడా దాన్ని ఏమాత్రం కదల్చలేకపోయాడు.

అది చూసి బలి రావణుణ్ణి దగ్గిరికి పిలిచి, ''నువు కదల్చలేకపోయిన ఆ కుండలం మా పూర్వీకుడైన హిరణ్యకశిపుడు చెవికి పెట్టుకున్నటువంటిది. ఆయన ఎవరివల్లా చావు లేకుండా వరాలు పొంది చివరకు నరసింహ రూపం దాల్చిన విష్ణువు చేతిలోనే చచ్చిపోయాడు. ఆ విష్ణువునే నువ్వు ద్వారం వద్ద చూశావు. ఆయన ఎప్పుడూ అక్కడే ఉంటూ ఉంటాడు,'' అన్నాడు.

ఈ మాటలు విని రావణుడు క్రోధంతో ద్వారం వద్దకు వచ్చాడు. కాని అతని కక్కడ ఎవరూ కనిపించలేదు.







# కావాలనే చేశారు!

సీతానగరంలో వుండే బంగారప్పకు పిల్లలు లేరు. ఎన్నో పూజలూ, వ్రతాలూ చేయగా, చేయగా—పెళ్ళయిన పదేళ్ళకు, బంగారప్ప భార్య కాసులమ్మ గర్భం ధరించింది. బంగారప్ప, భార్య నెంతో అపురూపంగా చూసుకుంటూండేవాడు.

ఒక రోజున భార్య దిగులుగా వున్నట్టు కనిపించడంతో బంగారప్ప, ఆమెతో, ''నువ్వలా దిగులుగా వుండకూడదు. నీ మనసులో ఎలాంటి కోరిక వున్నాసరే చెప్పు! అది తీరేమార్గం చూస్తాను,'' అన్నాడు.

''రామాపురంలో నాగయ్య దగ్గిర ముత్యాలహారం చేయించి, మెడలో వేసుకు తిరగాలని, నాకు కోరికగా వున్నది.'' అన్నది కాసులమ్మ.

రామాపురంలో నాగయ్య పేరుమోసిన నగలవ్యాపారి. అతడి దుకాణంలో తయారైన హారం మెడలో వేసుకుంటే, శుభప్రదమని కూడా చెప్పుకుంటారు.

బంగారప్ప మరెప్పుడైనా అయితే ఒప్పుకునేవాడు కాదేమో గాని, ఇప్పుడు తన శక్తిమేరకు భార్య కోర్కె తీర్చాలనుకుని, "సరే, నేను రామాపురం వెళ్ళి, నీకోసం హారం చేయించి తెస్తాను,'' అన్నాడు.

''నువ్వు పక్కన లేకుంటే, నాకెంతో అధైర్యంగా వుంటుంది. వేరే ఎవరినైనా రామాపురం పంపు,'' అన్నది కాసులమ్మ.

బంగారప్ప తన స్నేహితుడు రామయ్య కొడుకు గణపతిని, ఆ పని మీద పంపాలనుకున్నాడు.

గణపతి ఇరవై ఏళ్ళ యువకుడు. వడ్రంగం పనిలో తండ్రికి సాయం చేస్తూంటాడు. వాడికి రామాపురం చూడాలన్న సరదా వున్నది. అయితే; రామాపురంలో వాడికి బంధువు లెవ్వరూ లేరు.

"వసుంధర"



తిరుతున్నదని, వాడి తండ్రి కూడా సంతోషించాడు.

రామాపురం వెళ్ళాలంటే, ముందుగా సీతానగరం నుంచి పొరుగునే వున్న గ్రామానికి ఒంటెద్దుబండిపై వెళ్ళాలి. అక్కణ్ణించి బాడుగకు గుర్రపు బళ్ళుంటాయి. గణపతి ఆ విధంగానే ప్రయాణం చేసి, రామాపురం చేరుకున్నాడు. అక్కడ సిద్ధప్ప ఇంటి గురించి వాకబు చేశాడు. వివరాలు తెలుసుకుని సిద్ధప్ప ఇల్లు చేరే లోగా, దారిలో వాడు ఒకచోట జారి పడ్డాడు. బట్టలకు బురద అంటుకున్నది. ఏమైతేనేం—గణపతి, సిద్ధప్ప ఇల్లు చేరుకుని, వాళ్ళకు తను వచ్చిన పని చెప్పాడు.

సిద్ధప్ప అభిమానంగా, "మా బంగారప్ప పంపాడంటే, నువ్వు మాకు ముఖ్య అతిథివి. ఆ చేతిలోని మూట ఇలా యివ్వు; నేను దాస్తాను. ముందు నువ్వు వెళ్ళి పెరట్లో నూతి దగ్గిర స్నానం చేసిరా," అన్నాడు.

సిద్ధప్ప కొడుకు, గణపతిని బావి దగ్గిరకు తీసుకు వెళ్ళి, బొక్కెన అందించాడు. ఈ లోగా సిద్ధప్ప అక్కడికి పెద్ద నీళ్ళ గుండిగ ఒకటి తీసుకువచ్చాడు.

అతడు గణపతితో, "నీళ్ళిందులోకి తోడుకుని స్నానం చెయ్యి. స్నానం

వెళితే, ఏ పూటకూళ్ళ ఇంట్లోనో బస చేయాలి. అందుకూ, దారి ఖర్చులకూ బోలెడు డబ్బు వృధా అని, తండ్రి వాడిని పంపలేదు.

బంగారప్ప, గణపతిని పిలిచి, "నువ్వు రామాపురం వెళ్ళి, నాగయ్య దుకాణంలో ముత్యాలహారం పురమాయించి, అదయ్యే దాకా అక్కడే వుండి—హారం తీసుకుని రావాలి. అక్కడ మా చుట్టం సిద్ధప్ప వున్నాడు. వాళ్ళింట్లోనే, నీ మకాం. ఈ ప్రయాణానికయ్యే ఖర్చులన్నీ, నేను భరిస్తాను," అన్నాడు.

గణపతి ఉత్సాహంగా వెంటనే ఒప్పుకున్నాడు. కొడుకు సరదా, ఈ విధంగా

అయ్యాక గుండిగ నిండా నీళ్ళుండేలా చూడు!'' అని చెప్పాడు.

ఇంటికి వచ్చిన అతిథికి ఇలాంటి పని చెప్పినందుకు ఆశ్చర్యపడినా, గణపతి అలాగే చేశాడు. ప్రయాణబడలిక మూలాన వాడికి గుండిగను నీళ్ళతో నింపడం చాలా అలసట అనిపించింది.

గణపతి స్నానం చేసేటప్పుడే, బురద అంటిన తన బట్టలు కూడా ఉతికి ఆర వేసుకున్నాడు. వాటి కారణంగా సిద్ధప్ప తనను, ఏ పనివాడో అనుకున్నాడేమోనని వాడికి అనుమానం కలిగింది.

గణపతి బట్టలు మార్చుకున్నాక, సిద్ధప్ప వాడిని భోజనానికి రమ్మని పిలిచాడు. అక్కడ కూడా అందరూ గణపతికి చాలా ఆశ్చర్యం కలిగే లాగే ప్రవర్తించారు.

సిద్ధప్ప ఇంట్లోని వాళ్ళందరూ పీటలు వేసుకుని కూర్చున్నారు. వాళ్ళ ముందు వెండి కంచాలున్నవి., గణపతికి పీట వేయలేదు. అరిటాకులో భోజనం పెట్టారు. అది కూడా, అందరికీ సెగలుకక్కే వేడి అన్నం పెట్టి, వాడికి చద్దన్నం పెట్టారు.

భోజనం అయ్యేసరికి గణపతికి నిద్ర ముంచుకువచ్చింది. అందరూ మంచాలు వేసుకుని, గణపతికి చాప ఇచ్చారు. గణపతి ఆ చాప మీదే ఒళ్ళెరక్కుండా నిద్రపోయాడు.

మర్నాటి ఉదయం సిద్ధప్ప భార్య గణపతిని నిద్రలేపి, ''నాయనా, మా పాలే





రివ్వాళ రాలేదు. అలా పెరట్లోకి వచ్చి పాలు తీసి పెడతావా ?'' అని అడిగింది.

అ సమయానికి ఇంట్లో వాళ్ళెవరూ నిద్ర లేవలేదు. గణపతి పెరట్లోకి వెళ్ళి గేదెపాలు పితికాడు. సిద్ధప్ప భార్య వాడి చేత, ఇంటికవసరం అయిన నీళ్ళన్నీ తోడించింది.

గణపతి మారుమాట్లాడకుండా అన్ని పనులూ చేసి, తానిక నాగయ్య దుకాణానికి వెళ్ళి వస్తానన్నాడు.

''అక్కడికి నేనూ వస్తా పద!'' అన్నాడు సిద్ధప్ప.

బయలుదేరేటప్పుడు సిద్దప్ప చేతిలో బరువైన సంచీ ఒకటున్నది. సిద్దప్ప అ సంచిని గణపతికి యిచ్చి, ''ఇందులో గుమ్మడికాయ లున్నవి. మనం వెళ్ళే దారిలో, నా స్నేహితు డొకడున్నాడు. వీటిని ఆ ఇంట్లో ఇవ్వాలి,'' అన్నాడు.

ఆ గుమ్మడికాయల సంచీ మోయలేక గణపతి చేతులు చచ్చుపడ్డాయి. గుమ్మడికాయల్ని స్నేహితుడింట్లో ఇచ్చాక, సిద్ధప్ప గణపతిని, నాగయ్య దుకాణానికి తీసుకుని వెళ్ళాడు.

''నాగయ్యా! బంగారప్ప నాకెంతో కావలసినవాడు. ఎన్నో ఏళ్ళ తర్వాత, భార్య కడుపున ఓ కాయ కాస్తున్నది. నువ్వు హారాన్ని శ్రద్ధగా చేయించాలి. ధర ఎక్కువ చెప్పకూడదు,'' అని సిద్ధప్ప, నాగయ్యను హెచ్చరించాడు.

నాగయ్య సరేనని, హారం తయారీకి నాలుగు రోజుల గడువడిగాడు. ఆ నాలుగు రోజులూ సిద్దప్ప ఇంట్లోవాళ్ళు గణపతి చేత వీలైనన్ని పనులు చేయించుకున్నారు. అయితే, వాళ్ళు వాణ్ణి పల్లెత్తుమాట అని అవమానించలేదు. పని చేయించుకున్నారని తప్ప, వాళ్ళింట్లో దేనికీ వాడు అగౌరవ పడలేదు.

హారం తయారయ్యాక గణపతి తిరుగు ప్రయాణం అయినప్పుడు, ''మళ్ళీ ఎప్పుడొచ్చినా, నువ్వు మా ఇంట్లోనే మకాం చేయాలి,'' అని సిద్ధయ్య ఇంట్లో వాళ్ళం

దరూ ఎంతో అభిమానంగా ఏకకంఠంతో వాడికి చెప్పారు.

గణపతి సీతానగరం చేరుకుని, బంగారప్పకు హారం అందజేశాడు. బంగారప్ప ఎంతో సంతోషించి, వాణ్ణి ప్రయాణ విశేషాలడిగాడు.

గణపతి ముందు తటపటాయించినా, తర్వాత తనకు కలిగిన అనుభవాలన్నీ వరసగా ఒక్కొకటే బంగారప్పకు చెప్పి, "వాళ్ళు మనుషులు మంచివాళ్ళే! కాని, అతిథులతో ఎలా ప్రవర్తించాలో తెలియదనుకుంటాను," అన్నాడు.

జరిగింది వింటూనే బంగారప్ప కోపంగా, "తెలియకేం కాదు, కావాలనే వాళ్ళలా చేశారు. నాలుగు రోజులు నీకు బాగా తిండి పెట్టారుగా—అంతకంతా నీ నుంచి పని రాబట్టాలని అలా చేశారు," అన్నాడు.

"అబ్బే, కొందరికి కొన్ని మర్యాదలు తెలియవు. నాకు వాళ్ళ మీద ఒక్కసారి కూడా కోపం రాలేదంటే—మనుషులెంతో మంచివాళ్ళనే కదా అర్థం. వాళ్ళు కావాలని అలా చేసి వుండరు. అలా చేయడానికి కారణం అంటూ వుండాలి గదా!" అన్నాడు గణపతి నమ్మకంగా.

దానికి బంగారప్ప, "కారణం లేకేం? అసలు సంగతి నీకు తెలియక, అలా అంటున్నావు. అర్నెల్లక్రితం వాళ్ళు ఒక మనిషిని ఇక్కడికి పంపారు. వాణ్ణి మేమెలా చూశామో, వాళ్ళు నిన్నలాగే చూశారు. అంటే, కావాలనే చేశారని అర్థం కాదా?" అన్నాడు.

గణపతికి అసలు విషయం అర్థమైంది. బంగారప్ప మీది కోపం కొద్దీ, వాళ్ళు తనతో అలా ప్రవర్తించారన్న మాట! అయితే, ఇప్పటికీ బంగారప్ప, తను చేసినదానికి పశ్చాత్తాపపడడం లేదు. అంతా, సిద్ధప్ప కావాలని చేశాడని మాత్రమే కోపంగా వున్నాడు.

ఈ పరిస్థితుల్లో, ఇక ఏనాడూ బంగారప్ప పని మీద తను రామాపురం వెళ్ళగూడదని గణపతి నిర్ణయించుకున్నాడు.





# నేతగాడి చాతుర్యం

ఒకనాడు ఒక రాజుగారు సింహాసనం మీద కూర్చుని ఉండగా, పొరుగు దేశపు రాజు వద్ద నుంచి ఒక దూత వచ్చి, రాజు గారి సింహాసనం చుట్టూ సుద్దముక్కతో ఒక వలయం గీసి, మాటా పలుకూ లేకుండా నిలబడ్డాడు.

రాజు తన మంత్రులను పిలిచి, "వీడి ఉద్దేశం ఏమై ఉంటుంది?" అని అడిగాడు.

మంత్రులు ఏమీ చెప్పలేక తెల్ల మొహాలు వేశారు. రాజు మండి పడి, "దీనికి అర్థం చెప్పగల చతురుణ్ణి వెతికి తీసుకురండి," అని ఆజ్ఞాపించాడు.

మంత్రులు బెదిరిన కాకుల్లాగా అన్ని వైపులకూ వెళ్ళి గాలించారు. వారిలో కొందరు ఒక ఇంటికి వచ్చారు. ఇంటి లోపల ఒక గదిలో ఉయ్యాల ఒకటి దానంతట అదే ఊగుతున్నది. డాబా మీద ధాన్యం ఆరబోసి ఉన్నది. దానిని తినటానికి పక్షులు వేచి ఉన్నాయి. కాని ఎగువన ఉన్న పంఖా ఆడుతూ ఉండటం చేత అవి ధాన్యాన్ని సమీపించ లేకుండా ఉన్నాయి.

మంత్రులు మరొక గది ప్రవేశించి, అక్కడ మగ్గం నేస్తున్న నేతగాణ్ణి చూశారు.

"నీ ఇంట్లో ఈ విడ్డూరా లేమిటి? ఉయ్యాల దాని కదే ఊగుతున్నది, పంఖా దాని కదే ఆడుతున్నది!" అన్నారు వాళ్ళు.

"వాటిని నేనే ఆడిస్తున్నాను. మగ్గం నుంచి ఉయ్యాల కొక తాడూ, పంఖా కొక తాడూ కట్టి ఉన్నాయి," అన్నాడు నేతగాడు.

"అద్భుతం! అద్భుతం! నీవే మాకు కావలిసిన చతురుడివి. మా కొక సమస్య

వచ్చింది, దాన్ని విప్పగలవా?'' అని మంత్రు లడిగారు.

''ఏమిటా సమస్య?'' అని నేతగాడు అడిగాడు. మంత్రులు చెప్పారు.

నేతగాడు కొంచెంసేపు ఆలోచించి, ''ఇది, నేను వస్తే తప్ప తేలే విషయం కాదు.'' అంటూ రెండు గోలికాయలు తీసుకుని వారి వెంట బయలుదేరి రాజు గారి వద్దకు వెళ్ళాడు.

నేతగాడు రాజుగారికి దణ్ణం పెట్టి, వలయాన్ని గమనించి, దూతకేసి ఒక సారి చూసి, తాను తెచ్చిన గోలీలను వాడి ముందు పడేశాడు.

వెంటనే దూత తన జేబు నుంచి గుప్పెడు జొన్నలు తీసి కింద పోశాడు.

నేతగాడు చిరునవ్వు నవ్వుతూ, అవతలికి వెళ్ళి ఒక కోడిని తీసుకు వచ్చి, జొన్నగింజల మీదికి వదిలాడు.

ఆ కోడి గింజలన్నిటినీ, ఒక్కటి మిగల్చకుండా తిన్నది. అది చూసి దూత అతి వేగంగా నిష్క్రమించాడు.

''ఇదంతా ఏమిటో నాకు కొంచెం కూడా బోధపడలేదు.'' అన్నాడు రాజు.

''మరేమీ లేదు, మహారాజా. అవతలి రాజు మనని ముట్టడిస్తానని కబురు చేశాడు. మనం ఓటమి ఒప్పుకుంటామో, యుద్ధానికి సిద్ధమో తెలుసుకుందామని దూత వేచి ఉన్నాడు. ''మీరు గోలీలాడుకునే పిల్లవెధవలు,'' అని నేను సమాధానం చెప్పాను. ''మాకు చాలా సేన ఉన్నది,'' అని చెప్పటానికి వాడు జొన్నలు వెదజల్లాడు. ఒక్కట్టి కూడా మిగల్చమని కోడి ద్వారా నేను మళ్ళి జవాబు చెప్పాను. ఆ సందేశం పట్టుకుని వాడు వెళ్ళిపోయాడు.'' అన్నాడు నేతగాడు.

''భేష్! భేష్! నీవే నిజమైన తెలివి గల వాడివి! ఇక్కడ ఉండి పో. నిన్ను నా ప్రధానమంత్రిని చేస్తాను,'' అన్నాడు రాజు సంతోషంగా.

''ఇంకా నయం! నా కవతల బోలెడంత పని ఉన్నది,'' అంటూ నేతగాడు వెళ్ళిపోయాడు.



# పిసినారికి గుణపాఠం

బాగా ఆస్తిపాస్తులున్నా, పరమ పిసినారిగా పేరు మోసిన పాపయ్యకు, ఒకసారి చిల్లిగవ్వ ఖర్చు కాకుండా, తీర్థప్రదేశాలన్నీ తిరిగి రావాలన్న కోరిక కలిగింది. ఇందుకు ఒక పథకం ఆలోచించి, గుడ్డివాడుగా, కుంటివాడిగా నటిస్తూ; తనకు మూగతనం, చెవిటితనం కూడా వున్నట్టు రాసిన, ఒక రేకుబిళ్ళ మెళ్ళో వేసుకుని బయలుదేరాడు.

ఒకరోజున పాపయ్యను, ఒక తీర్థంలో బిచ్చమెత్తుతూండగా, అతడి ఊరివాళ్ళే అయిన గోపయ్యా, మంగయ్యా చూశారు.

అప్పుడు గోపయ్య, మంగయ్యతో, “పాపం! ఈ పాపయ్యకు, మన ఊరు వరదల్లో మునిగిపోయిన సంగతి చెప్పినా తెలియదే. ఏం చేద్దామంటావు?” అన్నాడు.

ఆ మాటలు వింటూనే పాపయ్య అదిరిపడి, తను జనం మధ్య గుడ్డి, మూగగా నటిస్తున్న సంగతి మరిచి, “ఏమిటీ మన ఊరు వరదల్లో మునిగిపోయిందా? నిజంగానా? అయితే, నా పెద్ద భవంతీ, వెయ్యి పుట్ల ధాన్యం కూడా, వరద నీటిలో మునిగిపోయాయన్న మాట!” అన్నాడు.

అంతవరకూ పాపయ్యను గుడ్డి, మూగ, కుంటి అనుకుంటున్న జనం, అతడి మాటలు విని, “ఇంత మోసమా!” అంటూ, పట్టుకుని చితకబాదారు.

ఇది చూసి గోపయ్య పెద్దగా నవ్వుకుంటూ దూరంగా వెళ్ళిపోయాడు. తనకు తగిన గుణపాఠం నేర్పేందుకే, అతడలా చేశాడని, పిసినారి పాపయ్యకు అర్థమైంది.

—ఎం. డి. సౌజన్య





# తేనెపిట్ట

ఆఫ్రికాలోని పర్వత ప్రాంతపు అరణ్యంలో ఇద్దరు అన్నదమ్ములుండేవారు. వారిద్దరూ అరణ్యంలో వేటాడి తమ కుటుంబానికి కావలిసిన ఆహారం తెస్తూ ఉండేవారు.

ఒకనాడు ఆ అన్నదమ్ములు చెరొక తోలు సంచీ భుజాన వేసుకుని, చెరొక విల్లూ, బాణాలూ తీసుకుని తమ ఇంటి నుంచి వేటకు బయలుదేరారు. అరణ్యంలోకి వెళ్ళే దారి వెంట వారు కొంతసేపు నడిచి తరవాత దారి కూడా లేని కీకారణ్యంలోకి అడుగుపెట్టారు.

కొంత దూరం వెళ్ళేసరికి ఒక చోట వరసగా మట్టికుండలు బోర్లించి ఉన్నాయి.

"ఏమిటిది? ఈ నిర్జన ప్రదేశంలో వీటిని ఎవరు ఉంచి ఉంటారు?" అన్నాడు తమ్ముడు.

"వాటి జోలికి పోకు. అందులో ఏం చేతబడి ఉందో! మన కెందుకొచ్చిన పీడ?" అన్నాడు అన్న. అతను కాస్త పిరికివాడు. కాని తమ్ముడు ధైర్యం గలవాడు. "వాటికింద ఏముందో చూసి తీరాలి," అన్నాడు వాడు.

చిన్నవాడు ఒక్కొక్క కుండనే ఎత్తి సరిగా నిలబెట్టుతుంటే అన్న దూరంగా పారిపోయి, వాటికేసి భయపడుతూ చూడసాగాడు.

తమ్ముడు ఎత్తి సరిగా నిలబెట్టే కుండల కింద ఏమీ లేదు. కాని వాడు ఆఖరు కుండను ఎత్తేసరికి, దాని కింది నుంచి ఒక పొట్టి ముసలమ్మ చెంగున ఇవతలికి దూకింది.

ఆమె, తనను విడిపించిన చిన్నవాడి కేసి చూడనన్నా చూడక, దూరాన నిలబడి ఉన్న పెద్దవాడితో, "ఎందు కలా బెదురుగొడ్డు లాగా నిలబడి వణికిపోతావు? నేను నిన్నేమీ చెయ్యను. నా వెంట



వచ్చావంటే మంచి చిత్రం చూపిస్తాను,'' అన్నది.

కాని పెద్దవాడు కొయ్యబొమ్మ లాగా నిలబడిన చోటి నుంచి ఒక్క అడుగు కూడా కదలనే లేదు.

''పిరికి వెధవా!'' అని ఆమె వాణ్ణి తిట్టి, చిన్నవాడి కేసి తిరిగి, వాణ్ణి తన వెంట రమ్మన్నది. అన్నిటికీ తెగించిన చిన్నవాడు ధైర్యంగా ఆమె వెంట బయలు దేరాడు.

ఇద్దరూ కొంత దూరం వెళ్ళాక, ముసలిది ఒక చెట్టువద్ద ఆగి, చిన్నవాడి చేతికొక గొడ్డలి ఇచ్చి, ''నాకీ చెట్టు కొట్టి పెట్టు,'' అన్నది.

వాడు గొడ్డలితో చెట్టు మానును ఒక్క దెబ్బ కొట్టేసరికల్లా మాను నుంచి ఒక ఆవు బయటికి దూకింది. అలాగే వాడు కొట్టిన ప్రతి దెబ్బకూ ఒక ఆవో, మేకో, గొర్రో, ఎద్దో మాను నుంచి బయటికి వచ్చింది. త్వరలోనే వాడి చుట్టూ పెద్ద పశువుల మంద తయారయింది.

''ఇవన్నీ నీకే. వీటిని తోలుకుని నువు ఇంటికి వెళ్ళిపోవచ్చు. నే నిక్కడే ఉండి పోతాను,'' అన్నది ముసలమ్మ.

తమ్ముడామెకు కృతజ్ఞత తెలుపుకుని, పశువుల నన్నిటినీ తోలుకుంటూ అన్న ఉన్న చోటికి వచ్చి, ''ముసలిది నా కేమిచ్చిందో చూడు. ఆమె పిలిచినప్పుడు వెళ్ళకపోతివి,'' అన్నాడు. తమ్ముడు పశువులను సంపాదించిన వైనమంతా విని అన్న ఏమీ అనలేదు.

ఇద్దరూ కలిసి గొడ్లతో సహా తమ గ్రామం కేసి బయలుదేరారు.

అసలే నడివేసవి. మంచి ఎండవేళ అన్నదమ్ము లిద్దరినీ దాహం తెగబాధిస్తున్నది. పశువులు కూడా పచ్చిగడ్డి కోసం తహతహలాడుతూ ఆకలితో అరుస్తున్నాయి.

కొంత దూరం వెళ్ళేసరికి చిన్నవాడు, ''చూడు, నీళ్ళు!'' అని అరిచాడు. వారి దారికి పక్కగా ఒక అగాధం ఉన్నది. అందులో చెట్ల మధ్యగా ఒక వాగు గలగలా

ప్రవహిస్తున్నది. కాని అక్కడికి దిగే దారి లేదు. అక్కడ కొండ నిటారుగా ఉన్నది.

"నన్ను తాటితో దింపుతావా? దప్పి తీర్చుకుని మళ్ళీ పైకి వస్తాను," అన్నాడు అన్న తమ్ముడితో.

తమ్ముడు అలాగే చేశాడు. అన్న అగాధంలోకి వెళ్ళి, కడుపు నిండా చల్లని నీరు తాగి, లేచి వచ్చిన ప్రాణాలతో మళ్లీ పైకి వచ్చాడు.

"నన్ను కూడా దించు. నేను కూడా దాహం తీర్చుకుంటాను," అన్నాడు తమ్ముడు. అన్న తాడు పట్టుకుని తమ్ముణ్ణి అగాధంలోకి దిగనిచ్చాడు. పశువులన్నిటినీ చూస్తుంటే వాడికి దుర్బుద్ధి పుట్టింది. వాడు చేతిలో ఉన్న తాడు కొస అగాధంలోకి విసిరేసి, తమ్ముణ్ణి అగాధంలో దిక్కులేని చావు చావటానికి వదిలేసి, గొర్లను తోలుకుని ఇంటికి వెళ్ళి తన తల్లిదండ్రులతో, "ఒక ముసలిది నాకీ గొర్లనన్నిటినీ ఇచ్చింది," అన్నాడు.

"అలాగా? తమ్ముడేడీ?" అని అడిగాడు తండ్రి.

"వాడింటికింకా రాలేదా? వాడు నడవలేక ఇంటికి తిరిగి పోతానని మిట్టమధ్యాన్నం వేళననగా బయలుదేరాడు. నేను మళ్ళీ వాణ్ణి చూడలేదు," అన్నాడు అన్న.



ఆ రోజల్లా చిన్నవాడు ఇంటికి తిరిగి రానేలేదు. కాని, వేటాడటానికి ఎటుగా వెళ్ళాడో లెమ్మనుకుని పెద్దవాళ్ళు అంతగా విచారించలేదు.

మర్నాడు చీకటితో ఆడవాళ్ళు ఊరి బావిదగ్గిర నీళ్ళు తోడుకునేటప్పుడు తేనెపిట్ట కూత వినిపించింది. ఆ ప్రాంతాల వాళ్ళు తేనెపిట్ట కూత వినిపిస్తే దాని వెంబడి పోతారు. ఎందుకంటే తేనెపిట్టలు వెళ్ళి వెళ్ళి తేనెపట్టులవద్దకు చేరుకుంటాయి. మగవాళ్ళు ఆ తేనెపట్టులను కొట్టి తేనె పిండి తెచ్చుకుంటారు.

అందుచేత, ఆ స్త్రీలు గబగబా తమ ఇళ్ళకు వెళ్ళి, మగవాళ్ళతో, "త్వరగా

పదండి, బావి దగ్గిర తేనెపిట్ట కూస్తున్నది!" అన్నారు.

అన్నదమ్ముల తండ్రీ, మరి కొందరు గ్రామస్థులూ తేనెపిట్ట కూతను బట్టి బయలుదేరారు. అది వారిని చాలా దూరం తీసుకుపోయింది. సాధారణంగా తేనెపిట్ట కూత తేనెపట్టుకు కొద్దిపాటి దూరంలోనే వినిపిస్తుంది. ఈ పిట్ట మాత్రం ఎంత దూరం వెళ్ళినా ఆగటం లేదు. అందు చేత చాలామంది మగవాళ్ళు ఇళ్ళకు మళ్ళారు. అన్నదమ్ములతండ్రీ, మరి కొద్ది మందీ మటుకు ఇంకా కొంచెం దూరం వెళ్ళి చూడ నిశ్చయించారు.

తేనెపిట్ట వెళ్ళి వెళ్ళి చప్పున అగాధం లోకి దిగిపోయింది. అందులో తేనెపట్టు ఉన్నప్పటికీ ప్రయోజనం లేదు. అందు చేత ఆ పిట్ట వెంట అక్కడిదాకా వచ్చిన వాళ్ళు నిరాశ చెందారు.

అన్నదమ్ముల తండ్రి అగాధంలోకి తొంగి చూశాడు. అతనికి పిట్టజాడ కనిపించలేదు గాని మనిషి జాడ కనిపించింది. అస్పష్టంగా మనిషి కంఠం కూడా వినిపించింది. "నా కొడుకు! వాడే ఆ అగాధంలో ఉన్నాడు!" అని ఆ తండ్రి కేకపెట్టాడు.

నలుగురూ కలిసి అగాధంలోకి తాడు జార్చి, చిన్నవాణ్ణి పైకి లాగారు.

చిన్నవాడు చెప్పినదంతా విని తండ్రి వలవలా ఏడ్చాడు. "పెద్దవాడు ఇంత నీచానికి పాల్పడతాడని ఎన్నడూ అనుకో లేదు! నీ కింత ద్రోహం చేశాడా? ఆ తేనెపిట్ట పుణ్యాన బతికావుగాని, లేక పోతే నీ గతి ఏమై ఉండేది?" అన్నా డతను.

"ఆ పెద్దవాణ్ణి నిలువునా చీల్చాలి! పాపిష్టి వెధవ!" అన్నారు మిగిలినవాళ్లు.

కాని పెద్దవాడి కెలా తెలిసిందో, తన తమ్ముడు అగాధంలో నుంచి పైకి వచ్చేసి నట్టు తెలిసింది. తన తండ్రీ, తమ్ముడూ ఇల్లు చేరేలోపునే వాడు ఇల్లూ, గ్రామమూ విడిచి ఎటో పారిపోయాడు. వాడి జాడ మరి తెలియరాలేదు.



## పెంగ్విన్ గుడ్లు

కింగ్ పెంగ్విన్ పక్షి, తన కాళ్ళ కింది సంచి లాంటి పొరతో దాని ఒకే గుడ్డును పొదుగుతుంది. చుట్టూ –40°C ఉష్ణోగ్రత ఉన్నప్పటికీ, గుడ్డు పొదగడానికి కావలసిన +40°C ఉష్ణోగ్రతను ఈ పక్షి సమకూరుస్తుంది. అంటే ఉష్ణోగ్రతలో 80°C తేడాను కలిగిసుందన్నమాట।





## అపోహ!

తేలు మంటలమధ్య తగులుకున్నట్టయితే, కొండెంతో కుట్టుకుని ఆత్మహత్య చేసేసుకుంటుందని అందరూ అనుకుంటారు. అయితే, అది నిజం కాదు. అన్ని విషజంతువులకు లాగానే తేలుకు కూడా దాని విషం, దాని శరీరానికి హాని చేయదు।

## ఊదా ఎలుగుబంటి ఆహారం

ఊదా ఎలుగుబంటి తన ఆహారానికి దాదాపు 70% మొక్కల మీదే ఆధారపడుతుంది. ఈ శాఖాహారంతోపాటు, చిన్న చిన్న పురుగులనూ, ఎలుకలనూ, పిట్టలనూ, ఉడతలనూ, చిన్న జింకలనూ కూడా ఊదా ఎలుగుబంటి పట్టి తింటుంది.



## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1987 ఫిబ్రవరి నెల సంచికలో ప్రకటింపబడును.



S Balasubramanian



S. B. Prasad

★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ డిసెంబర్ నెల 15 వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/–లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి :– చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

### అక్టోబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : జ్వరం లేని బాలుడి జబ్బు! రెండవ ఫోటో : డిగ్రీ లేని డాక్టర్‌కే తగ్గు!

పంపినవారు : ఎస్. సాయికుమార్, ఎం. జి. రోడ్, విజయనగరం–531202

బహుమతి మొత్తం రు. 50/– నెలాఖరులోగా పంపబడుతుంది.


చందమామ

ఇండియాలో సంవత్సర చందా : రూ. 30-00

చందా పంపవలసిన చిరునామా :

డాల్టన్ ఏజెన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600 026.

ఇతర దేశాల చందా వివరాలకు రాయండి :

చందమామ పబ్లికేషన్స్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600 026.

Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.

# సర్ఫ్ కొనడంలో మరింత వివేకం ఉంది

"తెలిసే చెప్తున్నా. సర్ఫ్ కొనడంలో ఉన్నంత వివేకం మరి దేనిలోనూ లేదు. దీని పవర్ ప్యాక్డ్ ఫార్ములా సామాన్యం కాదు—ఉప్పొంగే శక్తి! మీ డబ్బుకి మించిన విలువ ఇస్తుంది!"

**డబ్బుకి మించిన విలువా? అసలే సర్ఫ్ ఖరీదైనది కూడా కదా?**

"చూడండి! దీని వల్ల ఎంత ఎక్కువ ప్రయోజనమో గ్రహించారా మీరు? కేవలం సర్ఫ్ మాత్రమే నా బట్టల్ని అతి తెల్లగా ఉతుకుతుంది, పైగా వాటిని సంరక్షిస్తుంది. అందేత అవి కొత్త వాటిలానే కన్పిస్తాంటాయి. అంటే ఎప్పటికప్పుడు అదా— లెక్క కట్టి చూసుకోండి. సర్ఫ్. డబ్బుకి మించిన విలువ ఇస్తుందని అందుకే అన్నాను నేను".

**సరే లలితగారూ, కాని అందుకు సర్ఫ్‌లో ఉన్నది ఏమిటి?**

"ఎంతో ఉంది! ఒక కిలో మామూలు రకం పొడరు ఎంత ఉంటుందో, అంత పొడరు ½ కిలో సర్ఫ్ ప్యాకెట్‌లో ఉంటుంది. అంటే ఒక కిలో మామూలు రకం పొడరు ఉతికేటన్ని బట్టల్ని అర కిలో సర్ఫ్ ఉతుకుతుందన్నమాట. చూశారా, సర్ఫ్ నుంచి మీరు ఎంత విలువ పొందుతున్నారో?"




**అంటే, ఒక విధంగా, సర్ఫ్ తన ధర తిరిగి చెల్లిస్తుందన్నమాట!**

"ఒక విధంగా ఏమిటి, ఎన్నో విధాలుగా! మనకు లాభమే లాభం. చౌక రకంవి కొనడంలోనూ మంచి నాణ్యమైనది కొనడంలోనూ ఎంతో తేడా ఉంది. అందుకే అంటాన్నేను, సర్ఫ్ కొనడంలో మరింత వివేకం ఉందని."



A Super treat in every sweet!

# SUPER SIZE! SUPER TASTE!

nutrine

**SuperStar**

Premium toffees






TWIN TREAT

DELITE

TOP CREAM



Heavenly delights




CLARION/NC/8636